# సువర్ణ భాషితాలు



తాడి వెంకటకృష్ణారావు




ప్రచురణ:

శశిశ్రీ పబ్లికేషన్స్

హుమాయూన్‌నగర్, హైదరాబాద్ - 500028.

ఆంధ్రప్రదేశ్.

సువర్ణ భాషితాలు ( వచన ముక్తకాలు )
రచన : తాడి వెంకట కృష్ణారావు, బి.ఏ.

మొదటి ముద్రణ :
ప్రతులు 1000
మే 1982.


ముఖచిత్రాలంకరణ :
సిరిబాబు. పెరికీడు బ్రిడ్జి


రచయిత రేఖాచిత్రం :
శారంగ్. హైదరాబాదు-16

ప్రచురణ సంస్థ చిహ్నం :
చందు. హైదరాబాదు-27

ముద్రణ :
శ్రీ వరలక్ష్మి ప్రెస్, హైదరాబాదు-4

ముఖపత్ర ముద్రణ :
ఉదయ ఎంటర్ ప్రైజెస్, హైదరాబాదు-4



వెల : అయిదు రూపాయిలు.

ప్రతులకు

1. శ్రీ రమణా బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
బ్లాకు నెం. సి/6, ఇంటి నెం 22/బి,
లారెన్స్ రోడ్, న్యూఢిల్లీ-110035.

2. శశిశ్రీ పబ్లికేషన్స్, ఇంటి నెం. 10-8-192/2,
హుమాయూన్ నగర్, హైదరాబాద్-500028.

# కానుక



చిరంజీవి సౌభాగ్యవతి చెల్లి దుర్గలక్ష్మికి
ఆశీస్సులతో —కృష్ణన్న.

# తాడి వెంకట కృష్ణారావు

వయసుకు మించిన తాత్త్వికచింతన, జిజ్ఞాస ఎంత ప్రబలంగా చోటు చేసుకున్నాయో వయసు అంగీకరించని శైశవనైర్మల్యం అంతగామూర్తీభవించిన వ్యక్తి శ్రీ తాడి వెంకట కృష్ణారావు. అందుకే పసిపాపలను అలరించే తీయని పాటలు మొదలుకొని ముముక్షువులను చింతనా నిమగ్నులను చేయగల ఆధ్యాత్మిక రచనలవరకూ వైవిధ్యాన్విత రచనలు వీరికలంనుంచి వెలువడు తున్నాయి. సుమారు మూడుదశాబ్దాలుగా వీరి రచనా వ్యాసంగం తెలుగు పాఠకుల ఆదరాన్ని చూరగొన్నది.

వీరి స్వస్థలం కృష్ణాజిల్లా గన్నవరం తాలూకా పెరికీడు గ్రామం. తండ్రి శ్రీ లక్ష్మయ్యగారు. తల్లి శ్రీమతి రామమ్మగారు. వీరు 1937 జనవరి 13వ తేదీన పశ్చిమగోదావరి జిల్లా సత్యవోలులో జన్మించారు. శ్రీ లక్ష్మయ్యగారు నూజివీడు సంస్థానంలో ఉద్యోగిగా ఉండటంవల్ల వీరి బాల్యం లలితకళలకు నిలయమైన ఆ సంస్థానంలోనే గడిచింది. పాఠశాల విద్య కృష్ణా జిల్లాలోను, కళాశాల విద్య పశ్చిమ గోదావరి జిల్లాలోను ముగించుకొని ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి బి. ఏ. పట్టం పొందారు. ప్రస్తుతం ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ అనువాద శాఖలో తెలుగు అనువాదకులుగా పనిచేస్తున్నారు. ఈయన అన వరత సాహిత్యోపాసకులు, స్నేహశీలి, మృదుభాషి, భావుకత, కల్పనాసౌష్ఠవం, శబ్దమాధుర్యం ఎరిగిన రచయిత.

వివిధ పత్రికలలో వీరిగేయాలు, కథలు, వ్యాసాలు, ముక్తకాలు వెలువడుతున్నాయి. వీరి 'సిరిచుక్క మొగ్గ' గేయ సంకలనం తెలుగు సాహితీ ప్రియులను విశేషంగా ఆకర్షించింది. ముద్రణ కావలసిన రచనలు చాలావున్నాయి.

వీరు రచించిన "మూడో కన్ను" నాటిక 1971 లో "తీసరీ అంఖ్" అనే పేరుతో హిందీలో అనువాదంపొంది, నాటక పోటీలలో పాల్గొని బహుమతులు పొందింది. తులసీదాసు హిందీలో రచించిన 'హనుమాన్ ఛాలీసా' ను తెలుగులో గేయరూపంలో, అనువాదం చేశారు. వీరికి ఇంగ్లీషురచనలో కూడా మంచి ప్రవేశం వుంది "సాంగ్ ఆఫ్ ది యూనివర్స్" అనే గ్రంథం బ్లాంక్‌వర్సులో వ్రాశారు.

పదేళ్ల ప్రాయం నుంచే వీరికి నాటక కళలపట్ల ఆసక్తి కలిగింది. 1958లో విశాఖపట్నం, ఆంధ్ర విశ్వవిద్యాలయం నిర్వహించిన అంతర్ కళాశాలల నాటకపోటీలలో కూడా పాల్గొని ప్రశంసలు పొందారు. హైదరాబాదులో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలు, అఖిల భారత తెలుగు బాలల మహోత్సవాలు, ఆంధ్రప్రదేశ్ రంగస్థల కళాకారుల మహాసభల ఆహ్వానసంఘ సభ్యుడుగా వాటి విజయానికి చేయూత నిచ్చారు. బెంగుళూరులో జరిగిన అఖిలభారత తెలుగు రచయితల మహాసభల ప్రతినిధిగా పాల్గొన్నారు.

ఈయన సంస్కరణాభిలాషి. వీరి ఆధ్వర్యంలో కులాంతర, మతాంతర వివాహాలు జరిగాయి. వీరు 1957 లో కృష్ణా జిల్లాలో ఆర్. ఎం. ఇ. సొసైటీని స్థాపించారు. 1978 లో హైదరాబాదులో విజయభారతి సాహితీ, సాంస్కృతిక సంస్థను స్థాపించారు. గత 1[illegible]

సంవత్సరాలనుంచీ జంటనగరాలలోని సాంస్కృతిక సంఘాలలో వీరికి సన్నిహిత సంబంధం వున్నది.

ఈయన దేశాభిమాని, మానవతావాది. 1962 లో చైనా దురాక్రమణ సమయంలో జాతీయ రక్షణనిధికి తన చేతిగడియారాన్ని విరాళంగా ఇచ్చారు. 1976 లో ప్రపంచ ఆరోగ్య దినోత్సవ సందర్భంగా తమ మరణానంతరం నేత్రదానం చేయటానికి అప్పటి రాష్ట్ర గవర్నర్ సుఖాడియా సమక్షంలో ప్రకటించారు. 1977 లో కనీ వినీ ఎరుగని దివిసీమ ఉప్పెన బీభత్సానికి చలించిపోయి ఈయన తన బంగారు ఉంగరాన్ని ఉడతాభక్తిగా వరద బాధితుల సహాయనిధికి విరాళంగా సమర్పించుకున్నారు.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం 1971 లోనూ, 1979 లోనూ ఏర్పాటుచేసిన కవి సమ్మేళనాలలో వీరు పాల్గొని సన్మానం అందుకున్నారు. జంటనగరాలలోని కేంద్ర ప్రభుత్వ క్షేత్ర ప్రచార విభాగం, అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శన సంస్థ, ఆంధ్ర ప్రదేశ్ సచివాలయ సాంస్కృతిక సంఘం, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం, నవ్యసాహితి సమితి, అక్కినేని కళా సమితి, శ్రీనివాస సాహితీ సమితి వంటి తదితర సాంస్కృతిక సంఘాలవారు ఏర్పాటుచేసిన కవి సమ్మేళనాలలో పాల్గొని సత్కారం పొందారు. ఆకాశవాణి కార్యక్రమాలలోనూ తరచు పాల్గొంటూ వుంటారు. వీరికిగల "అభినవ వేమన" బిరుదు అన్వర్థమైనది.

కానుమోలు,
కృష్ణా జిల్లా.

డాక్టర్ రెడ్డి అప్పారావు
తేదీ 10-5-1982

# వినతి

ఉత్తమ సాహిత్యాన్ని తెలుగు పాఠకులకు అందించాలనే మహదాశయంతో శశి శ్రీ పబ్లికేషన్స్‌ను 1978 సంవత్సరంలో ప్రారంభించాం. ఈ సంస్థ తొలి కుసుమం 'సిరిచుక్క-మొగ్గ' సాహిత్యాభిమానులు మా కృషికి చేయూతనిచ్చి ఎంతగానో ఆదరించారు. ఆ ఆదరణను ఆలంబనంగా చేసుకొని ఇంకొక గ్రంథం సువర్ణభాషితాలను మీ ముందు ఉంచుతున్నాం. మరొక అవకాశాన్ని కలిగించినందుకు రచయిత శ్రీ తాడి వెంకట కృష్ణారావు గారికి మా హృదయ పూర్వక వందనాలు.

ముచ్చటగా ముఖచిత్రం రచయిత రేఖాచిత్రం, ప్రచురణ సంస్థ చిహ్నం తీర్చిదిద్దిన శ్రీ తాడి రంగసీతారాం (సిరిబాబు) గారికి, శ్రీ తాడి రంగారావు (తారంగ్) గారికి శ్రీ చందుగారికి మా కృతజ్ఞతలు.

ఈ గ్రంథ ప్రచురణలో మాకు అన్నివిధాలా సహకరించిన మా శ్రేయోభిలాషులు శ్రీ దేశరాజు వెంకట కృష్ణారావుగారికి శ్రీ ఇ. ఆర్. దినమణి గారికి, శ్రీ చోక్కావు వెంకట రమణగారికి హార్దికాభివందనాలు.

ఈ గ్రంథాన్ని చక్కగా ముద్రించిన వరలక్ష్మి ప్రెస్ వారికి బ్లాకులు బాగా తయారు చేసిన సత్యం ప్రాసెస్ వారికి, ముఖచిత్రం అందంగా ముద్రించిన ఉదయ ఎంటర్ ప్రైజెస్ వారికి మా ధన్యవాదాలు.

ఈ పుస్తకంలో కొన్ని అచ్చుతప్పులు ఉన్నందుకు చింతిస్తున్నాం. 41వ పుటలో 'చూసి' అనే మాటకు 'చూపు' అని, 'పురుగు' అనే మాటకు 'సిరుగు' అని, 43వ పుటలో 'ఉద్యోగస్థుడైనా' అనేదానికి 'ఉదోగస్థుడైనా' అని అచ్చుపొరపాట్లు దొర్లాయి.

ఒక పుస్తకం ఈ కాలంలో అచ్చువేయాలంటే ఎంతో వ్యయప్రయాసలతో కూడుకున్నది ఎక్కువమందికి అందుబాటులో ఉండేందుకు తక్కువ ధరకు అందంగా రూపొందించి అందించేందుకు ఎంత ప్రయత్నించినా వ్యయభారంవల్ల దీని ధరను రూ. 5/- లు నిర్ణయించవలసివచ్చింది.

ప్రతాప్ ఆర్ట్సు ప్రొడక్షన్స్ "ఇంట్లో రామయ్య వీధిలో కృష్ణయ్య" సినిమా అసిస్టెంట్ డైరెక్టరుగా పనిచేసిన యువకవి శ్రీ తాడి రంగ వర ప్రసాద్‌గారు రచించిన "అంతరంగ తరంగాలు" అనే గేయ కావ్యాన్ని త్వరలో మీకు అందించాలని ఆశిస్తున్నాం.

మా సంస్థ ముందడుగు వేయటానికి అండదండగా వున్న శ్రీ మన్నెపురి శ్రీరాం, శ్రీమతి మన్నెపురి గౌరి, శ్రీ కె. వి ఆర్., డాక్టర్ రెడ్డి అప్పారావు, శ్రీ సారేపల్లి వెంకటేశ్వర రావు, శ్రీ అప్పికట్ల మార్కండేయులు, శ్రీ కొత్తలంక కృష్ణమూర్తి గార్లకు ఎంత చెప్పినా ఇంకా రుణపడేవుంటాం.

తెలుగు పాఠకులు మా ఈ మలి ప్రచురణను కూడా ఆదరించి మా కృషికి చేయూత ఇవ్వగలరని విశ్వసిస్తున్నాం.

హైదరాబాద్,
15-6-1982.

తాడి విజయ ప్రసాద్
శశిశ్రీ పబ్లికేషన్స్

# కైమోడ్పు

ఆధునిక మానవుడు రూపుదిద్దుకొనే ముందు పదిలక్షల సంవత్సరాల కాలం పట్టినట్లు చరిత్రకారులు చెబుతున్నారు. మానవక్రమ పరిణామం అనేది ఒక అనంతయాత్ర. అతిదూర భవిష్యత్తులో నేటి మానవునిలో ఎన్నో అనాగరిక లక్షణాలు కనిపించవచ్చు. మానవుని మేధస్సు వికసిస్తున్నకొద్దీ నవనవోన్మేషమైన భావాలు ఆవిష్కృతమవుతుంటాయి. అసలు మానవజీవితమే పరిణామశీలమైనట్టిది. అదొక నిరంతర ప్రవాహోన్ముఖమైన మహాస్రవంతి. అందుకనే యుగధర్మం మారుతూవుంటుంది. జీవిత విలువలలో మార్పులు కన్పిస్తాయి. అయితే మౌలికమైన సత్యాలు, మానవత్వం, సద్వర్తన ఇత్యాది గుణాంశాలు అన్ని కాలాల్లోనూ అందరకూ శిరోధార్యమవుతుంది.

సమ్యక్ జీవన మార్గాన్వేషణలో సామాన్యుడనైన నేను పరిపరి విధాల ఆలోచనలు చుట్టుముట్టిన పరిస్థితులలోనూ మనసులో అనేకానేక భావ పరంపరలు ఉద్భవించేవి. అవి మహనీయుల ద్వారా విన్నవి, గ్రంథపఠనవల్ల తెలిసినవి, లోకపరిశీలనా గతంగా సుబోధకమైనవి. ఇలా ఎన్నెన్నో రీతులలో ఆ భావాలు నా ముందు నిలిచేవి. వాటిని ఆనాడు గ్రంథస్థం చేసుకొనేవాడిని. ఇది రెండు దశాబ్దాల క్రిందటిమాట. వాటిని పునరావలోకనం చేసినప్పుడు నాకు అవి నిత్యసత్యాలుగా తోచాయి. వాటికి మెరుగులు దిద్దుకున్నాను. పదేపదే మననం చేసుకున్నప్పుడు మనస్సు ఉత్తమ అనుభూతి పొందేది.

హృదయం ఆనంద తరంగితమయ్యేది. ఈ అనుభూతిని, ఆనందాన్ని పదిమందికీ పంచాలనే ఆకాంక్ష నాలో ఉద్భవించింది. అందుకే వాటిని సువర్ణ భాషితాల రూపంలో క్రోడీకరించి అభిజ్ఞులైన పాఠక మహాశయులకు సమర్పిస్తున్నాను.

నా ఈ ప్రయత్నానికి నాపై ఆశీస్సులు కురిపించిన మహనీయులు కరుణశ్రీ, బందా కనకలింగేశ్వరరావు, పెండ్యాల అంకాల వెంకట సుబ్బారావు, స్వామి బ్రహ్మానంద సరస్వతి, శతావధాని వేలూరి శివరామశాస్త్రి, ఎం ఆర్. అప్పారావు, పాతూరి మధుసూదనరావు, బెజవాడ గోపాలరెడ్డి గార్లకు, తమ అమూల్య అభిప్రాయాలతో వెన్నుతట్టి ప్రోత్సహించిన మహా పండితులు డాక్టర్ దివాకర్ల వెంకటావధానిగారికి, ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవి వరేణ్యులు డాక్టర్ దాశరథిగారికి నా వినయాంజలి ఘటిస్తున్నాను.

ఈ సువర్ణ భాషితాలలో కొన్నింటిని 1965-66 సంవత్సరాలలో ప్రచురించిన ఆంధ్రప్రభ దినపత్రిక సంపాదకులకు నా కృతజ్ఞతలు.

'సువర్ణభాషితాలు' క్రోడీకరణలో తోడ్పడిన సహృదయులు శ్రీ గోవిందరాజు రామకృష్ణరావు గారికి అభివాదాలు.

గ్రంథ ప్రచురణ బాధ్యత వహించిన శశిశ్రీ పబ్లికేషన్స్ వారికి నా ధన్యవాదాలు.

పుష్ప నిలయం,
హైదరాబాదు,
13-5-1982.

ఆకెళ్ల వెంకట శాస్త్రులు

కళాప్రపూర్ణ
డాక్టర్ దాశరథి, డి. లిట్
ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి

# మనసును గెలిచే మాటలు

భర్తృహరి వాపోయాడు "జీర్ణమంగే సుభాషితం" అని. అందులో సత్యం లేకపోలేదు.

కాని సుభాషితాలు ప్రతిసారీ వృధాపోవు. మహామహుల భాషితాలు మహిమాన్వితాలు. మానవకోటినే మార్చగలిగిన సుభాషితాలున్నాయి. నినాదాలవంటివీ వున్నాయి.

"వందేమాతరం" బంకింబాబు

"క్విట్ ఇండియా" గాంధీజీ

"స్వరాజ్యం నా జన్మహక్కు" తిలక్

ఉపనిషత్ సూక్తులన్నీ సుభాషితాలే కదా!

నా మిత్రులు శ్రీ తాడి వెంకట కృష్ణారావు గారు సరళ, సరళశైలిలో వచనంలో ''సువర్ణభాషితాలు'' రచించారు. కొన్ని విన్నట్లుగా అనిపిస్తాయి. అయినా మళ్లీ చెప్పవలసిన అవసరం ఉంది.

సత్యాన్ని వధించే రోజుల్లో, ధర్మాన్ని చెఱల పాలుచేసే రోజుల్లో "సత్యం వద, ధర్మంచర" అని మళ్ళీమళ్ళీ చెప్పవలసివుంది కదా. పునః పునా రచనద్వారా, పునః పునః పఠన, పాఠనముల ద్వారా సుభాషితాలు మానవహృదయాలను మార్చగలుగుతాయని దృఢంగా నమ్ముతున్నాను. ఫలితం ఎలావున్నా రచయిత తన కర్తవ్యం మరవరాదుకదా!

ఆ మధ్య ఒక పుస్తకం "Ben Franklin's Wit and Wisdom" అనే పుస్తకం—నా అమెరికా పర్యటన సందర్భంలో ఒక మిత్రుడు ఇవ్వగా—లాస్ ఏంజలస్‌లో చదివాను. అందులో చాలా మనకు తెలిసినవే. కాని వాటిని Ben Franklin తనవిగా రూపొందించి అందించాడు.

ఉదాహరణకు "Fish and visitors shrink after three days" "మూడురోజులయ్యేసరికి చేపలూ, అతిథులూ వాసనకొడతారు" అన్నాడు. ఇది అనుభవంలోమాటే, కాని ఆయన చెప్పడంలో చమత్కారం చేశాడు.

మిత్రులు తాడి వెంకట కృష్ణారావు గారు సుభాషితాలను కొత్త పద్ధతిలో చెప్పారు. సరికొత్తవీ స్వయంగా చెప్పారు.

"పాతపురాణం అంటుంటాం. పురాణం అంటే కేవలం పాతకాదు. పురా అపి నవం. పాతదైకూడా కొత్తది. అదీ పురాణంలోని విశేషం. సుభాషితాలు పాతపడవు.

"అనవసరంగా ప్రసంగించకు" అన్నారు రచయిత. ఇది

నాకు ఎంతో నచ్చింది. నేను అనవసరంగా ప్రసంగిస్తుంటాను లెండి! ఈ సుభాషితం నుండి నేను నేర్చుకోవలసింది చాలా వుంది. అలాగే ఎన్నో-

"కళాభిమానం లేని జీవితం గంధంలేని పుష్పం వంటిది" రచయిత ఇచ్చిన ఈ ఉపమానం హృదయాన్ని పట్టేస్తుంది.

ఇవి కేవలం సుభాషితాలు కావు, సువర్ణభాషితాలు. పిన్నలకు పెద్దలకు పఠనీయాలు. ఆలోచనలు రేకెత్తించి హృదయ పరివర్తనకు తోడ్పడే "సువర్ణభాషితాలు" రచించిన నా మిత్రులు శ్రీ తాడి వెంకట కృష్ణారావుగారిని అభినందిస్తున్నాను.

లోకానికి సువర్ణం అక్కరలేదు.

సువర్ణభాషితాలు కావాలి.

సువర్ణ భాషితాలకు సుస్వాగతం.

మాతృశ్రీ మందిరం,
హైదరాబాదు-1.

దాశరథి
5-4-1982.

శిక్షా ప్రపూర్ణ
డాక్టర్ దివాకర్ల వేంకటావధాని ఎం. ఏ. (ఆనర్సు) పి హెచ్. డి.

# నికషోపలము

మిత్రులు శ్రీ తాడి వేంకట కృష్ణారావు గారు రచించిన సువర్ణ భాషితాలను గ్రంథము నాద్యంతము పఠించి యానందము నందితిని. సుభాషితములనగా సూక్తులని అర్థము. అవి అమూల్యములగుటచే సువర్ణభాషితములని పేర్కొనబడినవి. పూర్వము భర్తృహరి మున్నగువారు సంస్కృతములో శ్లోకరూపమున నిట్టి సుభాషితములు వెలయించి యుండిరి. విలువనుబట్టి అవి పెక్కు భాషలలోనికి పద్యరూపమున ననువదింపబడినవి. వానికి టీకా తాత్పర్యములుకూడా వెలసినవి. అవిగాక నన్నయాది మహాకవులు తమ గ్రంథములలో సందర్భోచితముగా చొప్పించిన సూక్తులెన్నో యున్నవి. నన్నయగారి నానారుచిరార్థ సూక్తి నిధిత్వము, ఎఱ్ఱనగారి సూక్తి వైచిత్రియును, తిక్కనగారి నీతులును, శతకములందు పెద్దలెందరో వెల్లడించిన శాశ్వతములైన నీతి రత్నములును జగత్ప్రసిద్ధములు. వానిలో పెక్కు పద్యమయము లగుటచే నాధునికులు వానిని పఠించుటగాని, పఠించినను సమగ్రముగా నవగాహనము చేసికొనుట కాని జరుగుట లేదు. తత్ఫలితముగా బాలబాలికల దును, యువకులందును నీతివర్తనము సన్నగిల్లుచుండుట జాత్యభ్యుదయకాముకులకు శోకకారణమగుచున్నది.

శ్రీ వేంకట కృష్ణారావు గారు తమ కప్పుడప్పుడు స్ఫురించిన మంచి భావములను సర్వసుబోధమైన భాషలో వచనమున రచించి

యీ గ్రంథముగా ప్రచురించిరి. ఇందలి పలుకులన్నియు యథార్థముగా పసిడి పలుకులే. సామాన్యముగా జనులందఱును జీవితమున నవలంబించి యైహికాముష్మిక సౌఖ్యమునందుట కనువైన యీ మేలిపలుకులను వారెంత శ్రద్ధతో, లోకహిత కాంక్షతో వెల్వరించి యుండిరో చెప్పజాలను. ఇవన్నియు వచనముక్తకములు. ప్రతి సుభాషితము నందును వారి లోకానుభవమును, జగన్నిశిత పరిశీలనమును వ్యక్తములగుచున్నవి. అన్ని రంగములకును సంబంధించిన నీతులిందున్నవి. ఇవి చల్లగా పఠితల హృదయములందు ప్రవేశించి వారికి సర్వసంస్తుత్యము, శాశ్వతములైన సద్వర్తనము నలవఱచు ననుటలో సందేహము లేదు. కొన్ని వేమన పద్యములవలె హాస్యయుక్తములును, హేళనామయములును సులభసుందరములునయి వాడిమియు, వేడిమియు కల్గియున్నవి. స్వానుభవజన్యములగుటచే సుభాషితములన్నింట సహజత్వమును నైశిత్యమును తొంగిచూచుచున్నవి. వారిభాష లలితమై, సుబోధమై, సుందరమై యున్నది. ప్రస్తుత ప్రపంచమునందలి పరిస్థితులను పరిశీలించినచో నీ సుభాషితములు లోకమునకెంతో మేలుచేకూర్చునని నేను భావించుచున్నాను.

“హితం మనోహారిచ దుర్లభం వచః” అని భారవి చెప్పియుండెను. ఈ సుభాషితములలో నా రెండు లక్షణములు వింతగా సమ్మిశ్రితములై యున్నవి. ఈ పైడి పలుకులను లోకశ్రేయమునకై ప్రచురించిన శ్రీ కృష్ణారావు గారిని హృదయపూర్వకముగా నభినందించుచు వారిట్టి గ్రంథములింకను ప్రచురించి లోకమునకు మేలు చేకూర్తురని ప్రార్థించుచున్నాను.

హైదరాబాదు, దివాకర్ల వేంకటావధాని
2-4-1982.

**తాడి** వెంకట కృష్ణారావు

* సరస్సులో తెల్లని పద్మం అందం. తెల్లని వెన్నెల్లో నల్లని మేఘం అందం. నల్లని ఆకాశంలో మిలమిల మెరిసే తారకలు అందం. తల్లి ఒడిలో పసిపాప బోసినవ్వులే అందం. దేశభక్తితో నిండిన మనసు మరీ అందం. భగవద్భక్తితో నిండిన హృదయం అంతకంటే అందం.

* వీణ మ్రోయిస్తే నీ బుద్ధి వికసింపదా? మృదంగం వాయిస్తే నీ మనసు రంజిల్లదా? నాదస్వరం నీకు ఆనందం ఇవ్వదా? నాగస్వరం నిన్ను నాట్యం చేయింపదా? అట్లాగే రామనామాన్ని నీవు జపిస్తే నీ నయనాలు ఆనందాశ్రువులతో నిండవా?

* కళాభిమానంలేని జీవితం గంధంలేని పుష్పం వంటిది.

* శారీరక సౌందర్యం చూసి మురిసిపోనేల? దానికితోడు మానసిక సౌందర్యం కూడా పెంపొందించుకోవాలి.

* జ్ఞానంలేని చదువు మేడిపండు మెరుగువంటిది.

* కష్టాలు కలిగినప్పుడు క్రుంగిపోవటం, సుఖాలు కలిగినప్పుడు పొంగిపోవటం అజ్ఞాని లక్షణం. కష్టసుఖాలు అమావాస్య పౌర్ణమి వంటివని తెలుసుకొని మానవుడు సమత్వాన్ని పాటించటం ఇహపరాలలో కూడా ముక్తిదాయకం.

* ధైర్యంలేని దీక్ష గాలిలో దీపంవంటిది.

* వెకిలిగా నవ్వకు. నవ్వవలసినపుడు నవ్వు. అప్పుడే ఆ నవ్వుకు అందం. అదే మనిషికి ఆభరణం.

* నియమం లేని మనిషి నిగ్రహం కోల్పోతాడు. నిగ్రహం కోల్పోయిన మనిషి జీవితం నిరర్థకం.ఎంత ప్రయత్నించినా,ఎన్ని కష్టాలనుభవించినా తుదకు కార్యసాధనలో విఫలుడవుతాడు.

* మర్యాదతో మాట్లాడు. మనసు విప్పి మాట్లాడు. ఇష్టం లేకపోతే అసలు మాట్లాడవద్దు. నటించకు.

* అనవసరంగా ప్రసంగించకు. విలువైన కాలాన్ని సద్వినియోగం చేయటం ధర్మం.

* అదృష్టంవచ్చే సమయంలో అనుకోకుండా నూతిలో నీరు ఊరినట్లుగా కలిసివస్తుంది. సిరిసంపదలు పోయేటప్పుడు కనులారా మనం చూస్తూఉండగా అవి హారతికర్పూరంలా హరించుకుపోతాయి.

* బిరబిర నడుస్తున్న పసిపాపడు ముద్దు. వడివడిగా పారుతున్న పంటకాలువ ముద్దు. కొండపైనుండి జరజరా జారుతున్న నీటిజాలు మరీముద్దు. అంతకంటే ముచ్చట గొలిపే భగవన్నామస్మరణ ఎంతో ముద్దు.

* అంబుధిలో తరంగాలు, ఆకాశంలో పతంగాలు ఎట్లా ఎగిరి ఎగిరి తిరిగి యథాస్థానానికి చేరుతున్నాయో అట్లాగే మానవుడు ప్రపంచసుఖాలు ఆశించి మిడిసిపడుతున్నాడు. కాని భక్తి అనే స్థానానికి రాకనే ప్రశాంతతగాని, పరమాత్మ సాన్నిధ్యంగాని పొందలేడు.

* తాత్కాలిక సుఖాలను ఆశించక భక్తిభావంతో తారక మంత్రాన్ని కనుగొని రామనామామృతపానంచేసి శాశ్వతానందం పొందాలి.

* తల్లిని మించిన దైవం, కవిత్వాన్ని మించిన విద్య, రామనామాన్ని మించిన మంత్రం లేదు.

* వాల్మీకి కాళిదాసులను మించిన కవులు లేనట్లే స్వార్థం లేని దేశసేవకునికి, కోరికలు లేని విశుద్ధభావాలు గల దైవభక్తునికి మించినవారు లేరు.

* గుణవంతుడు ఉక్కు స్తంభంలాగ బలం కలిగి ఉంటాడు. గుణహీనుడు గోగుపుల్లలాగ అశక్తిమంతు డవుతాడు.

* ఓర్పు చాలా గొప్పది. అంతకుమించిన ధర్మం మరొకటి లేదు. దానిని ఆచరించినప్పుడే మానవుడు దైవత్వాన్ని పొందగలుగుతాడు.

* నీకు ఏమైనా దయవుంటే ఇతరులకు సహాయంచెయ్యి. అంతేగాని సహాయం చేసేవారికి మాత్రం అడ్డుపడకు.

* స్థిరంలేని మనసు కనులు లేని మనిషివంటిది.

* ఇతరులు బాగుపడితే ఏడుస్తావెందుకు? వారు బాగుపడితే నీకేమీ అపకారం జరుగలేదుకదా? ఎందుకా ఏడుపు? సంతోషించు. అప్పుడే నీవూ బాగుపడతావు

* కంటికి కనుపాప ఎంతో ఇంటికి ఇల్లాలు అంతే.

* అందరికీ అనుగుణంగా మెలగాలని ఎంత ప్రయత్నించినా సంపూర్ణ సిద్ధిని పొందటం అసాధ్యం.

* పర స్త్రీలతో హద్దుమీరిన పరిచయం చీమమిరపకాయ చవి చూడటం వంటిది.

* తప్పులు జరగవచ్చు. తప్పులు జరిగాయని ఒప్పుకుంటే క్షమించటం కూడా ఉత్తమ లక్షణం.

* మనిషికి, మాటకు విలువలేకుండా పోయింది. అంతా నటన. అంతా బూటకం. ఈ సంఘం తెరపై కన్పించిందీ విన్పించిందీ మాత్రమే గ్రహింపగల్గుతుంది. కాని దాని యథార్థ స్వరూపాన్ని, నిర్మలత్వాన్ని, నిజాయితీని, నిష్కల్మషాన్ని పరిశీలించదు. పరిశీలించడానికైనా ప్రయత్నించదు. సత్యాన్ని విప్పి చెపుదామంటే విన్పించుకోదు.

* మాటకు ప్రాణం సత్యం. అట్లాగే మనిషికి ప్రాణం అతని గుణం.

* నిష్కళంకమైన భావాలతో కూడిన మాటలు మధురమైన భాషలో లేకపోయినా లోటు లేదు. అట్లాగే మధురమైన భావన దేవునిపై ఉండటం ముఖ్యంగాని ఆయనను మనసులో నిర్మలంగా నిలపకుండా డాంబికంగా జపతపాలు చేయడం వ్యర్థం.

* సంసారమనే సంకుచితమార్గాన్ని విడిచి భక్తి అనే సువిశాల పథంలో పయనిస్తూ స్వర్గమనే గమ్యాన్ని చేరి, భగవంతుని పాదపద్మాలు సేవించాలి.

కాడి వెంకట కృష్ణారావు

* రాజహంస పాలను నీళ్ళను వేరుచేసి పాలనుమాత్రమే త్రాగేటట్లుగా సంసారబంధాలు తగ్గించుకొంటూ భక్తిభావాన్ని పెంపొందించుకోవాలి.

* సంసారసాగరంలో భక్తి అనే నౌకపై ముందుకు సాగుతూ ఆవలిఒడ్డు చేరి మోక్షానందాన్ని అనుభవించాలి.

* ప్లాస్టిక్‌తోనూ కాగితంతోనూ చేసిన పువ్వులు అసలైన పువ్వులను మించినట్లు కన్పిస్తాయి. ఈ కాలంలో విద్యావంతులెవరో, అవిద్యావంతులెవరో, సజ్జనులెవరో, దుర్జనులెవరో చూసి వెంటనే గ్రహించలేని స్థితి కలుగుతున్నది.

* ఒకరి ముందు నీ తల్లిదండ్రులను నీవు నిందిస్తే వందమంది ఎదుట అవమానపడవలసి వస్తుంది. నెమ్మదిమీదగాని అది అర్థం కాదు. ఉన్నతదశలో ఉన్నపుడే ఆ అవమానం ప్రాప్తిస్తుంది.

* మలమలా మాడిపోతున్న ఎండలో ఉండమన్నా ఉంటారు. సలసలా కాగిపోతున్న నీటిలో చెయ్యి పెట్టమన్నా పెడతారు. కాని స్వార్థాన్ని మాత్రం వీడలేరు

* వలవలా ఏడుస్తూ కుమిలిపోయే కుటుంబాలూ ఉన్నాయి. కిలకిలా నవ్వుకుంటూ కళకళలాడే కుటుంబాలూఉన్నాయి

* తల్లిదండ్రుల మాట తనయుడు పాలించడం ధర్మం. భార్యాభర్తలు ఒకరిమాట ఒకరు గౌరవించుకోవడం ధర్మం.

* స్ప్రింగు కుర్చీలో కూర్చున్నపుడు అది అణిగి ఉంటుంది. లేవగానే అది యథాస్థితికి వస్తుంది. అట్లాగే మానవుడు కొన్ని క్లిష్టపరిస్థితులకు లొంగి అణిగి ఉంటాడు. అంతమాత్రాన అసమర్థుడని భావించేవారు అవివేకులు.

* నిజమైన భక్తునికి ఇహలోక సుఖాలతో పనిలేదు. ఈ జన్మ బుద్బుద ప్రాయమైనదనే ఎరుకతో మొదటినుండే శాశ్వతా నందం, స్వర్గానందం పొందటానికి తగిన భక్తితో ముక్తి కోసం దేవుని ప్రార్థిస్తూ వుంటాడు.

* కామోద్రేక సమయంలో సిగ్గూ, బిడియం వదిలివేయ టానికైనా సంశయింపరు. కామాన్ని జయించటం చాలాకష్టం. అయినా నిగ్రహంతో దీనిని జయించాలి. అట్లా జయించిన మహామహుడు నిజంగా ధన్యజీవి. మోక్షఫలం అతని ఎదుటనే ఉన్నదన్నమాట.

* భగవంతుని పాదపద్మాలు స్పృశించాలంటే భక్తి ప్రధానం. భక్తిమార్గంలో పయనించటం ఏటికెదురీదటం వంటిది. ఎదురీదటం కష్టమని వెనుదిరగటం అవివేకం. వివేకంతో, వజ్ర సంకల్పంతో ముందుకు సాగితే ఆత్మానందం లభిస్తుంది.

* తల్లిదండ్రులు బిడ్డల శ్రేయోభివృద్ధులను ఎంతగా కోరు కుంటారో, అట్లాగే భగవంతుడు నిజమైన భక్తులగురించి తలపోస్తాడు.

* ముళ్ల పొదలు, పుట్టలు, గుట్టలు ఉన్న ప్రదేశంలో జాగ్రత్తగా నడుస్తూ ఎలాగమ్యాన్ని చేరుతామో ఆ విధంగానే

భక్తుడు తన భక్తిమార్గంలో అడ్డువచ్చే అరిషడ్వర్గాలను తప్పించుకుంటూ భగవంతుని సన్నిధికి చేరాలి.

* పాంచభౌతికమైన దేహమే సుందరమా ? ఇహలోక సౌఖ్యాలే శాశ్వతమా ? నరకాన్ని చూసి స్వర్గమని, పందిని చూసి నందని, గాడిదను చూసి గుర్రమని భ్రమిస్తున్నారు.

* అద్దంలో ఎవరు చూసుకుంటే వారి ప్రతిబింబమే కనిపించేటట్లు ఒకరు సృష్టించింది ప్రపంచంలో ఏ దేశానికైనా సన్నిహితంగా ఉండేటట్లు చేయటం దాని సంపూర్ణతకు నిదర్శనం. ఆనాడే దాని ఔన్నత్యం వెల్లివిరుస్తుంది.

* నిజం మాట్లాడు. ఎన్ని కష్టాలొచ్చినా నిజాన్ని వీడకు. అందులోనే దేవుడున్నాడు. సత్యమనే దేవుణ్ణి ఆరాధిస్తే నీకు ముక్తి లభిస్తుంది.

* జీవితం అశాశ్వతమని మనలో ప్రతి ఒక్కరికీ తెలుసు. అయినా ఆశలు అనే వలలో చేపలులా పడిపోతున్నాం.

* మనసిచ్చి మాట్లాడే మిత్రునితో కమ్మగా మాట్లాడు. కల్మషంతో మాట్లాడకు. హృదయం తెరిచి మనసారా మాట్లాడు.

* మనంచేస్తున్న ప్రతిమంచిపనికీ భగవంతుని అండ ఉంటుంది. 'నేనే సాధించా ఈ ఘనకార్యం' అని చెప్పుకోవటం అజ్ఞానం.

* ఎండిన ఆకులు ఎగిరిపోయేటట్లు, పండిన కాయలు పడిపోయేటట్లు, పుట్టిన ప్రతిజీవి గిట్టక తప్పదు. అశాశ్వతమైన ఈ జీవితాన్నిగురించి ఎందుకో ఈ పేరాశలు, ఈ దురాగ్రాలు.

* హాలాహలం తరువాత అమృతం లభించింది. విషమ పరీక్షల అనంతరమే భగవంతుని దర్శనం కలుగుతుంది.

* రాజహంసవలె ఉన్నాననుకొని కొంగ ఆనందిస్తుంది. కాషాయాంబరాలు ధరించి మహాభక్తుని వలె ఉన్నాననుకుంటే వచ్చే గొప్పేమిటి ?

* ఉల్లిపూవు, మల్లిపూవు కలిపివేసినా దేనివాసన దానికే ఉంటుంది. అట్లాగే భగవంతుని కోరే భక్తులు సంసారంలో ఉన్నా, సంసార సుఖాలాపించి సన్యాసంలో ఉన్నా వారి వారి నడత ననుసరించే గ్రహించవచ్చు.

* నావకు చుక్కాని ఎట్టిదో, భర్తకు భార్య అట్టిది.

* ఒక గ్లాసు నీటిలో పంచదార కలిపితే అంతులేని మాధుర్యం, మరొక గ్లాసు నీటిలో ఉప్పు కలిపితే చెప్పలేనంత క్షారం ఎలా వస్తుందో, మానవుడు అలవర్చుకునే గుణాలను బట్టి మారుతుంటాడు. భక్తి అనే పంచదార కలిపితే తీపి అనే స్వర్గం దొరుకుతుంది. పాపం అనే ఉప్పు కలిపితే క్షారం అనే నరకం లభిస్తుంది. ఇటు పుణ్యం చేసుకొని ఆనందం పొందటమైనా అటు పాపం చేసుకొని నరకం అనుభవించటమైనా మనచేతిలోనే ఉంటుంది.

* పిల్లి ఎలుకను వెంబడిస్తే ఎలా తప్పించుకోవడానికి ప్రయత్నిస్తుందో అలాగే అరిషడ్వర్గాలకు మానవుడు దొరక్కుండా ఉండాలి

శాడి వెంకట కృష్ణారావు

* జననీ జనకులను నిందించడం కంటే వేరొక ఘోర పాతకం లేదు.

* ఇళ్ళూ, భూములూ కొనాలనిఎంత పోటీపడుతున్నారో అంత పోటీ భక్తిలో ఉంటే ఎంత బాగుంటుంది !

* ఉత్కృష్టమైనది మానవ జన్మట! ఆ ఉత్కృష్టత నాకేమీ కన్పించడం లేదు. ఈ దేహం నశ్వరమైందని తెలిసికూడా భగవంతుని ధ్యానించకుండా నీతిబాహ్యలయిన కార్యాలొనర్చడం ఎంత శోచనీయం? నిజంగా మానవుడంతటి అవివేకి నాకు కన్పించడం లేదు.

* కీర్తికాంత కొందరికి, ధనాశ కొందరికి, సిద్ధులపై ఆసక్తి కొందరికి. ఇవన్నీ వ్యర్థాలయినవి. భగవన్నామ స్మరణం ఒక్కటే మోక్షానికి మూలమైంది.

* కొన్ని వాచీలు కీ ఇవ్వకుండా తిరుగుతాయి. కొన్ని వాచీలకు రోజూ కీ ఇవ్వాలి. సంఘాన్ని పరిత్యజించి నిర్జనప్రదేశంలో మౌనంగా ఉండి భగవంతుణ్ణి సేవించినా మోక్షం లభిస్తుంది. సంసారంలో ఉండి భగవంతుని ప్రతిరోజూ సేవించినా ముక్తి లభిస్తుంది.

* భక్తిభావంతో మనం కాలం గడిపితే అరిషడ్వర్గాలు మన చెంతకు చేరలేవు.

* గోంగూరాకులు ఎంత తమాషాగా దొంగిలించావురా అని తల్లి పిల్లవాడి నైపుణ్యానికి మెచ్చుకొని ఆనందించినట్లు

పెరిగి పెద్దవాడై సెంట్రలు జైలుకి వెళితే ఆనందిస్తుందా? అందుకే చిన్ననాడే రవ్వంత దొంగతనం చేసినా శిక్షించి, పిల్ల వాడికి మంచి శిక్షణ ఇచ్చి పెంచితే ప్రయోజకుడవుతాడు.

* అయస్కాంతం చెంతకు ఇనుపముక్క చేరేటట్లే, పళ్లాన్ని చూసి నీరుపారేటట్లే భగవంతునిపై నిజమైన భక్తుని మనసు సదా లగ్నమై ఉంటుంది.

* నిజంగా కళ్ళకు ఏదీ కన్పించదు. వెలుతురు సహాయం తోనే దేనినైనా చూడగలుగుతాం. ఆవిధంగానే నీకు ఎంత ప్రజ్ఞ ఉన్నప్పటికీ దేవుని సహాయం లేకపోతే రాణించలేవు.

* దిక్సూచి ఏసమయమందైనా ఉత్తరదక్షిణాలనే చూపించే టట్లు అసలైన భక్తుడు సంసారంలో ఉన్నా సన్యాసంలోఉన్నా ఆయన మనస్సు భక్తిమీద, భగవంతునిమీద పోతుంది.

* తల్లిదండ్రులు పిల్లలందరినీ సమానమైన ప్రేమవాత్సల్యా లతో చూసేటట్లు ఏమతంవారైనా నిజమైన భక్తులందరిని భగవం తుడు సమానప్రేమ వాత్సల్యాలతో చూస్తాడు. ఏమతంవారు ఏవిధంగా పూజిస్తే భగవంతుడు ఆవిధంగా దర్శనమిస్తాడు.

* ఆముదాన్ని వాసనచూస్తే ఎంత వెగటుకల్గుతుందో ఉసిరి కాయగాని చింతకాయగాని ఎవరైన తింటున్నపుడు చూస్తే ఎట్లా నోరు ఊరుతుందో ఆవిధంగానే ఐహిక సుఖాలంటే అసహ్యించుకొని ఆముష్మిక సుఖాలకై ప్రతి మానవుడు ఉవ్విళ్ళూరాలి.

తాడి వెంకట కృష్ణారావు

* ఒక శిల్పి తన నైపుణ్యంతో భగవంతుని విగ్రహాన్ని ఎట్లా చెక్కుతాడో, ఒక చిత్రకారుడు కుంచెతో ఎట్లా చిత్రిస్తాడో, ఒక కవి తన కవిత్వంతో మన కనులముందు ఎట్లా సాక్షాత్కరింపజేస్తాడో అట్లాగే ప్రతిమానవుడు నిగ్రహం, భక్తి అనే సాధనాలద్వారా భగవంతుని సాక్షాత్కారం పొందాలి.

* భగవంతుని పాదపద్మాలు పట్టుకొని ఆనందించాలన్నా, మోక్ష ఫలాన్ని అనుభవించాలన్నా భక్తితో మెలగాలి. ఐహిక సుఖాలు మనకు తరచు అడ్డువచ్చినా ఆ ఒడుదుడుకులను అతి జాగ్రత్తగా తప్పించుకొంటూ ఆముష్మిక సుఖాలను అందుకొని ఆనందించాలి

* చాతక పక్షులు మేఘాలకై కాచుకొని కూర్చున్నట్లు, చకోర పక్షులు వెన్నెలకోసం ఎదురుచూసేటట్లు, భక్తుడు ఎల్లప్పుడూ భగవంతునికోసం వేచివుండాలి.

* తమ కవిత్వాన్ని ఇతరులు శ్రద్ధతో చదివినా, తమ చిత్రాలను పరులు ఆసక్తితో తిలకించినా, తాము గానంచేసిన పాటకు శ్రోతలు చెవులు రిక్కించి ఆనందించినా తాము చేసిన కార్యాన్ని తమతోపాటు ఇతరులు కూడా తృప్తిచెందినా వారు అమితానందాన్ని ఎట్లా పొందుతారో అట్లాగే భగవంతుడు సృష్టించిన ప్రతిజీవిని ప్రేమతో చూస్తూ మనోవాక్కాయ కర్మలచే హింసింపకుండా ఉంటే భగవంతుని దయ మనమీద ఎల్లప్పుడూ ఉంటుంది.

* గాలం ముల్లుకు పెట్టిన ఎరనుచూసి భ్రమపడి చేప తిన బోయి తన ప్రాణాన్నే పోగొట్టుకుంటుంది. ఎరవంటి ఇహ సుఖాలకు తాత్కాలికంగా లోనై ముల్లు అనే నరకంలో చిక్కుకుంటారు. మోక్షానికి మూలమైన మానవజీవితాన్ని వ్యర్థం చేసుకుంటారు.

* చర్మచక్షువులు,జ్ఞానచక్షువులు కాగలిగితే ఆ పరమానందం వేరు. ఆ హృదయం ఎంతో నిర్మలంగా ఉంటుంది.

* ఈనాటి మానవుడు ఏవిధమైన తప్పుచేసినా దానినిఒప్పుగా సమర్థించుకోగలిగే తెలివితేటలు పొందాడు.

* ఫ్యాను తిరుగుతూఉండగా దాని రెక్కలు కన్పించకుండా గాలి వస్తుంది. ఆ విధంగానే భగవంతుడు మనకు కన్పించ కుండా మనలను రక్షిస్తూ ఉంటాడు.

* మనసు అనే మీటను ఆపి ఐహికసుఖాలను వదిలితే భగ వంతుని దర్శనం కల్గుతుంది.

* మరణం తథ్యం. అందువల్ల మరణం తరువాత మానం శాశ్వతానందం పొంది స్వర్గాన్ని చేరాలంటే ఈ క్షణంనుంచైనా పాపం చెయ్యకు. భక్తితో దేవుని స్మరించు.

* కడుపునిండా అన్నంతిని అరుగుతుందా, అరగదా అనే ఆలోచన లేకుండా మన నిత్యకృత్యాలలో ఏవిధంగా నిమగ్న మైపోతామో ఆ విధంగానే సంసారంలో ఉన్నా స్వార్థమూ,

— తాడి వెంకట కృష్ణారావు

అమితాశలలో తగుల్కోకుండా సర్వదా భగవత్ చింతనతో కాలం గడపాలి.

* పైపు మిషనుముందు కూర్చొని అక్షరాలు నేర్చుకొనేటప్పుడు ఎప్పుడు ఉత్తరం పైపు చేద్దామా అని, హార్మోనియం మెట్లు నేర్చుకొనేటప్పుడు ఎప్పుడు పాటలు వాయించేద్దామా అని ఎంత ఆతృత వుంటుందో భక్తి అనే భావంలో కూడా అట్లాగే మునిగి తేలుతూ భగవంతుని ఎప్పుడు దర్శిస్తామా అనే ఆసక్తి, ఆవేదనా ఉండాలి.

* చవిటి నేలపై పడిన వాన ఉప్పునీరుగాను, రేగడి నేలపై పడిన వాన మంచినీరుగాను ఎట్లా మారుతుందో, అట్లాగే ఒకే విషయం అవిద్యావంతుడు చెప్తే పరిహాసిస్తారు. విద్యావంతుడు చెప్తే పరిగ్రహించి ప్రశంసిస్తారు.

* నిర్లక్ష్యంగా వుంటే లక్ష్యాన్ని చేరటం అసంభవం. అలక్ష్యం చేయక సలక్షణంగా కార్యాన్ని నిర్వహిస్తే లక్ష్యాన్ని చేరుతావు.

* శౌర్యంవున్నా రణరంగంలో చేతిలో ఆయుధం ఉండాలి. ఉత్కృష్టమైందీ మోక్షానికి మూలమైందీ మానవజీవితమైనా భక్తి ఉండాలి.

* ప్రతి చిన్న విషయంలోనూ నీవు జాగరూకుడవై వుంటే పెద్దపెద్ద కార్యాలలో సహితమూ సునాయాసంగా విజయాన్ని సాధింపగలుగుతావు.

* తింటానికి తిండిలేకపోయినా, ఉండటానికి ఇల్లు లేక పోయినా ఉండవచ్చును గాని, పుట్టిన పిల్లలు వక్రమార్గం పట్టి తిరుగుతుంటే పరులు చెడ్డగా చెప్పుకోవటం కంటే వేరొక దుఃఖం తల్లిదండ్రులకు లేదు.

* పందికి పన్నీరు పోసినా అది బురదగుంట వదలదు. కుక్క తోక బద్దలతో కట్టినా దాని వంకర పోదు. అట్లాగే విద్య వున్నా జ్ఞానంలేనివాడు పశుప్రాయంగా ప్రవర్తించక మానడు.

* ఆకలివేస్తే ఎంత బాధపడతామో భగవంతునికోసం భక్తుడు అంతగా తపనచెందాలి.

* భక్తుడు కొన్ని కష్టాలనుభవించక తప్పదు. కష్టాలనే ప్రవేశ పరీక్ష పాసయితే శాశ్వతసుఖం తథ్యం.

* డిగ్రీలు జ్ఞాపకశక్తికి చిహ్నాలు. ఉద్యోగాలకు కొలత పాత్రలు.

* తల్లిదండ్రులను లక్ష్మీనారాయణులుగా భావించి పూజించకపోగా హృదయంలో అగ్ని రగిలిస్తే తగిన ప్రతిఫల మనుభవిస్తారు.

* దేశం నలుమూలలా నీకీర్తి వ్యాపించినంతనే ఆనందంతో హద్దులుదాటి అహంకారంతో ఎగిరి పడవద్దు. అందరికీ తలలో నాల్కలా మునుపటి మాదిరి నమ్రతగా వుంటే నీ ఔన్నత్యం ఎంతో అధికమవుతుంది.

* అరిషడ్వర్గాలను అంటనీయకుండా మనసు భగవంతునిపై లగ్నం జేసి జీవితాంతం ఆయన పాదసన్నిధిలో గడిపితే ఎంత ధన్యతో, మాతృదేశ రక్షణకై రణరంగంలో ఆనందంతో అసువులు బాసినా అంతటి ధన్యత పొందుతాం.

* పాపులను పవిత్ర నదీమతల్లులు, భూమాత ఓర్పుతో ఏ విధంగా భరిస్తున్నారో, ఆ విధంగానే పిల్లలు చేసే దూషణలు, చెడుగులను తల్లిదండ్రులు ఓర్పుతో భరిస్తారు.

* మానవుడు సౌధాన్ని నిర్మించడం చిత్రం. పిచ్చుక, ఆకు చివరగాని కొమ్మచివరగాని గూడును నిర్మించటం అంతకంటే విచిత్రం. దేవతలుకూడా మానవజన్మ దాల్చి చివరకు మోక్షం పొందుతారని అంటారు గదా! అట్లాగయితే విశిష్టమైన మానవ జన్మలో భగవంతుని ప్రతిదినమూ పదినిముషాలైనా ధ్యానించక పోవటం అన్నిటికంటే అతి విచిత్రమైనది.

* పుత్రుడు నిష్ప్రయోజకుడైతే తల్లిదండ్రులబాధ బడబానలంలా ఉంటుంది పుత్రుడే దుర్మార్గుడైతే గుండె పగిలినట్లుంటుంది.

* ప్రాణం తీయటం తేలికే. ప్రాణం పోయటం అసంభవం. ఖర్చుపెట్టటం అతిసులువు, సంపాదించటం అతికష్టం. వ్రతం విఘ్నం చేయటం ఎంతో తేలిక. వ్రతం నిర్విఘ్నంగా పూర్తిగావించటం అతి కష్టం. చెడ్డనిపించుకోవటం క్షణం పట్టదు. మంచనిపించుకోవటం మహాకష్టం. అట్లాగే అందాలరాశిపై

మనసు మళ్ళించటం అతి సునాయాసం. కాని బంగారు భగవంతునిపై మనసు మరల్చటం మహాకష్టం.

* కమ్మరి వంకరగా వున్న ఇనుపముక్కను ఎర్రగా కాల్చి ఎట్లా సమ్మెటతో మోది సరిచేస్తాడో అట్లాగే మనలోవున్న అవగుణాలను భక్తితో తొలగించుకొని మనిషిగా మారాలి.

* ఎండిన బెండ చిట్లక మానదు, పాపం పండిన పతనంతప్పదు.

* మనచుట్టూ వీచే గాలినే నీవు చూడలేకపోతున్నావు. మనలోఉన్న భగవంతుణ్ణి ఇట్టే చూపించమంటే ఎట్లా ? "భగవంతుడు లేడు" అంటే "గాలి లేదు" అని నేనంటాను. నీవేమంటావు ?

* బంగారాన్ని పుటంపెడితే వన్నె వచ్చేటట్లుగా భగవంతుడూ అప్పుడప్పుడూ కష్టాలు పెడితేనేగాని మంచిమార్గంలో నడవలేం.

* దైవాన్ని మించినది మాత, మాతను మించినది మాతృభూమి.

* భక్తి ఇసుమంతైనా కలిగితే భగవంతుని కీర్తించు. నిర్మలమైన, నిశ్చలమైన భక్తి అలవడకపోయినా అతికి అతకని మనసుతోనైనా ఆ పరమేశ్వరుని కీర్తించు. కొంతకాలానికి భక్తిమార్గంలో గమ్యం చేరకపోయినా కొంతదూరమైనా చేరుతావు.

శాడ వెంకట కృష్ణారావు

* నిస్సారమైన సంసారంలోపడి ఎంతో సారమనుకొని ఆనంది స్తావా? స్వర్గ సౌఖ్యానికి బదులు యమయాతనలు అనుభ వించటానికి అర్రులు చాస్తున్నావా?

* కాకుల గుంపులో కోకిల ఉండగలదా? కోకిల కంఠం కాకులకలవడునా? ఆవిధంగా భగవంతునిపై లగ్నమైన మనసు బాహ్యప్రపంచమందుండగలదా? బాహ్యప్రపంచమందు తగు ల్కొన్న మనసు ఆధ్యాత్మికానందం పొందగలదా?

* అర్ధాంగి అనుకూలమైనదైతే జీవనసమరంలో అపజయ మంటూ ఉండదు.

* ఒకరికి చెప్పాలి, ఒకరితో చెప్పించుకోకూడదు అని డబ్బు గాని హోదాగాని ఉన్నవారికి ఎట్లా ఉంటుందో అట్లాగే ఉన్న వారు ఒకరికి పెట్టాలిగాని ఒకరినుండి గుంజటానికి ప్రయత్నించ కూడదు.

* మనం ప్రతిరోజూ ఆహారాన్ని తీసుకొని ప్రాణాన్ని ఎట్లా నిలబెట్టుకుంటున్నామో, ఆవిధంగానే రోజు కొక సారైనా భగవన్నామాన్నిస్మరిస్తే జీవితం సుఖమయమవుతుంది.

* సంసార విముఖత గల్గి సంఘాన్ని పరిత్యజించి మౌన ముద్రలో ఉండి నిర్మలత్వంతో భగవన్నామం జపించటం కొన్ని జన్మల తపఃఫలమే.

* మనలను సరైన బాటలో నడిపించేదే సద్విమర్శ.

* కోకిల "కూ" అంటే "కూ" అని ఎట్లా అంటుందో భగవంతుడు మన మనసులో మెదిలితే చాలు పిల్చినట్లుగా భావించి ఆయన నామాన్ని స్మరించాలి.

* గౌరవం అనే పంజరంలో బందీలై వుండటంవల్లనే ఎక్కువమంది పాడుపనులు చేయకపోవటానికి కారణం.

* పదవీవ్యామోహం, కామదాహం పతన హేతువులు. భగవంతునిపై భక్తివిశ్వాసాలు ఆత్మోన్నతికి, హేతువులు.

* హృదయంలోనే దేవాలయం నిర్మించు. దేవుని ప్రతిష్ఠచేసి మనోనేత్రాలతో దేవుని చూస్తూ పూజచేసినవాడే ధన్యుడు. హృదయపూర్వకమైన భక్తి మనసులో లేకుండా పదిమందీ మెచ్చుకొనే భక్తికి ముక్తి లేదు. హృదయ దేవాలయం నిర్మించుకోవటానికి నీవద్ద శక్తి లేకపోతే శారీరక నేత్రాలతో కొంత కాలం భూమిమీద నిర్మించిన దేవాలయంలో దేవుని పూజించు. తరువాత హృదయ దేవాలయం నిర్మించి, దేవుని నిల్పి సదా ధ్యానిస్తూ ఆత్మానందాన్ని పొందవచ్చు.

* పరిస్థితులు విపరీతమైనపుడు నీవు మాట్లాడిన ప్రతిమాటా విపరీత పరిణామాలకు దారితీస్తుంది.

* బ్రతికి చెడినవారితో బాగా స్నేహంచేసినా తప్పులేదు కాని చెడి బ్రతికిన వారితో స్నేహం ముళ్ళపై పాన్పువంటిది.

* కుక్కలు ఎన్ని మొరిగినా ఏనుగు లెక్కచేయకుండా తన మార్గంలో తాను ఎట్లా పోతుందో అట్లాగే మానవుడు భక్తి మార్గంలో నడచిపోవాలి.

* ఏకాలానికావాతావరణం, ఏవయస్సుకామనసు ఉండటం సహజం.

* మాతృమూర్తి విచారాన్ని తొలిగించి సంతోషాన్ని కల్గించటం ఎంత అదృష్టమో! భరతమాత కన్నీటిని తొలిగించి ఆనందజ్యోతిని వెలిగించటం కూడా అంత అదృష్టం.

* కోడలు అత్తవారింటిలో కొంత స్వాతంత్ర్యం త్యాగం చెయ్యాలి. అల్లుడు అత్తవారింటిలో కొన్నికోరికలు త్యాగం చెయ్యాలి. ప్రతిపౌరుడు దేశంకోసం కొంత స్వార్థాన్ని త్యాగం చెయ్యాలి. అప్పుడే అంతా ఆనందమయంగా ఉంటుంది.

* ఆశయాలుండేనే ఆలోచనలు. ఆశలు ఉండేనే ఆవేదనలు. ప్రోత్సాహం ఉండేనే అమితోత్సాహం.

* ఎవరేమి చెప్పినా ఆసక్తితో, అభిమానంతో వినాలికాని మంచిని గ్రహించి చెడ్డను విడనాడటం ఎంతో ఉత్తమం.

* ఒకవ్యక్తి వెలుగు కిరణాలలో ప్రవేశించాలన్నా చీకటి తెరలలో చేరుకోవాలన్నా ప్రచారం ప్రముఖ పాత్ర వహిస్తుంది

*డబ్బుగాని, హోదాగాని ఉన్నవ్యక్తి చెప్పేమాటలు న్యాయంకాదని వినకపోయినా, చెప్పినపని సమంజసంకాదని

చేయకపోయినా, సమయంచిక్కినప్పుడు పగతీర్చుకోవడానికి ప్రయత్నం చేస్తాడు. పరులకు మనలనుగురించి ఎంతనీచంగా చెప్పటం సాధ్యపడుతుందో అంతనీచంగా చెపుతాడు.

* ఎవరేమన్నాపడు. ఎదురు చెప్పకు. కాలం బాగాలేదు. పడినవాళ్ళు చెడిపోరు. నీధ్యేయాన్ని నీవుసాధించు.

* తనయులు తమ తల్లిదండ్రులపై ఎంతవిశ్వాసం చూపిస్తారో అంతవిశ్వాసం ప్రతిఒక్కరూ భగవంతునిపై చూపించాలి.

* మనం నిద్రించిన తర్వాత మనచుట్టూ ఉన్నవారు ఏమి చేస్తున్నారో మనకు తెలియనట్లే మనం మరణించిన తర్వాత ఈ లోకంతో మనకున్న బంధాలు వాటికవే తెగిపోతాయి. ఇందులో మొదటిది తాత్కాలిక నిద్ర, రెండవది శాశ్వతనిద్ర.

* తప్పుచేశావని చెపితే నీరైపోతావు. తప్పుచేసినా ఒప్పు చేశావని స్తుతిస్తే ఉబ్బితబ్బిబౌతావు. నిన్ను అనేదేముంది. స్త్రీనైజమే అది!

* పనికిమాలినది, ధూళితోనైనా పోలదని అనుకొన్నది, ఒక్కొక్క సమయంలో ప్రధానపాత్ర వహిస్తుందనటంలో సందేహం అణుమాత్రమైనా లేదు.

* సజ్జనుడు ఎప్పుడయినా ఒకర్ని సకారణంగాగాని అకారణంగాగాని బాధిస్తే తరువాత పశ్చాత్తాపపడి వానిపై నిండయిన ప్రేమకలిగి హృదయం క్షోభించక మానదు.

కాడి వెంకట కృష్ణారావు

* భగవంతుణ్ణి పరిపూర్ణ విశ్వాసంతో సదా స్మరిస్తున్న వారికి బాధలు, బంధాలు సడలిపోతాయి.

* తెరచాప, గాలి సహాయంతో పడవ ఏటికి ఎదురుగానైనా సులభంగా సాగిపోతుంది. అట్లాగే "భక్తి" అనే తెరచాప "దేవుని కరుణ" అనే గాలి సహాయంతో "సంసారం" అనే పడవ "కష్టాలు" అనే ఏటికి ఎదురుగానైనా అతి తేలికగా సాగిపోతుంది.

* మాతృ సేవ ఎంత ఉత్కృష్టమైందో దేశ సేవ కూడా అంత ఉత్కృష్టమైంది.

* అన్ని దైవాలలో అగ్రస్థానం మాతృదేవిదే. అన్ని త్యాగాలలో మించిన త్యాగం మాతృదేశం కోసం చేసిందే.

* మాతృమూర్తి కన్నీరు కార్చటానికి నీవు కారకుడవైతే ఆ కన్నీటి కాల్వలో చిక్కుకొని మునుగుతూ, తేలుతూ ఉక్కిరి బిక్కిరి అయిపోతావు జాగ్రత్త.

* యుగయుగానికీ ధర్మం నశిస్తూ అధర్మం పెచ్చు పెరుగుతున్నట్లే రోజు రోజుకూ విశాల హృదయం నుంచి సంకుచిత తత్వంలోకి జారిపోతున్నాడు మానవుడు.

* కలానికి పాళీ చివరనున్న మొనఆధారం. మనిషికి అత నిలో ఉన్న నడవడి ఆధారం.

* ఇతరులు సుఖాలు పొందుతుంటే మనం బాధపడకూడదు. కాని వారు కష్టాలు పడుతుంటే అందులో పాలు పంచుకోవడం, ఉదార్చటం మన ధర్మం.

* పరీక్ష ఫలితాలు తెలిసేముందున్న ఆలోచనా, ఆరాటం పరీక్షల ముందుంటే మంచి మార్కులతో కృతార్థుడవవుతావు.

* పరువు పోగొట్టుకొనే కాలమొస్తేనే గర్వంగా ప్రవర్తిస్తారు. ఎంత ప్రజ్ఞ ఉన్నప్పటికీ అంతా భగవంతుని కృపగానే భావించి వినయంగా ఉండటం మంచిది.

* తన తల్లిని అవమానిస్తుంటే చూస్తూ ఊరుకోవటం ఎంత నీచమో మాతృభూమిని కబళించటానికి యత్నించే వారిని ఎదుర్కోకుండా కూర్చోవటం కూడా అంతనీచమే.

* చావంటే భయమెందుకు ? నీకు చావు తప్పదు. ఇప్పుడో మరొకప్పుడో ! ఎందుకు నీకీ తాపత్రయం?

* కళ మనిషికి సౌందర్యాన్ని, ఆత్మానందాన్ని, అద్వితీయమైన తృప్తిని ఇస్తుంది.

* ఇతర దేశాలలో ఉన్నపుడు మాతృభాష వింటే ఎంతటి ఆనందోత్సాహాలు కలుగుతాయో అంతటి అభిమానం, ఆనందం ఎల్లప్పుడూ మాతృభూమిపై కూడా ఉండాలి.

* రామనామాన్ని త్రికరణ శుద్ధిగా జపిస్తే సర్వవేళలా సుఖసంతోషాలు లభిస్తాయి. రామనామ స్మరణ ఒక్కటే నీ పరలోక యాత్రలో పరమపూజనీయమైన పాత్ర వహిస్తుంది.

* భార్యా పిల్లలు, చుట్టపక్కాలు, బంధుమిత్రులు-వీరంతా

తాడి వెంకట కృష్ణారావు

ఎవరు ? నీవు మరణించిన తరువాత నీకూ వారికీ ఏమిటి సంబంధం ?

* స్వతంత్రంగా బ్రతుకు, లేకపోతే నీ భావాలు కూడా నీలాగే బానిసత్వంలో ఉండి పోతాయి.

* వెకల్పుచాలు కన్న లోతుచాలు ఎట్లామంచిదో అట్లాగే పైపై భక్తి కంటే అంతరాత్మలో ఉన్న భక్తి ప్రబలమైనది.

* ఒక కార్యాన్ని సాధించటానికి కనీసపు వీలున్నప్పటికీ ఇతరుల సహాయం కోరకుండానే స్వయంగా కృషి చేస్తాడు· ఏమీ వీలు లేనప్పుడు మాత్రమే అన్యులను అర్థిస్తాడు.

* ఈ కలికాలంలో ధర్మానికి తావులేదు, అధర్మం ముందు ధర్మం సిగ్గుపడవలసిందే. చిట్టచివరకు ధర్మానికి తగిన ప్రతిఫల ముంటుందేమోనని అంటాడు శిక్షింప బడిన నిరపరాధి.

* నీవూ నేను అనే భేదం కల్పించి, కులమత తత్వాలు, ముఠాతత్వాలు రేపి సమైక్యతకు భంగం కలిగించే ద్రోహులనే ఈ సంఘం ఎంతో గౌరవిస్తున్నది.

* తప్పని తెలిసినా మాయవల్ల తప్పుచేసి మరుక్షణం లోనే పశ్చాత్తాప పడతాం.

* స్వాతి ముత్యపుచిప్పలోపడిన నీటిబిందువు ముత్యమైనట్లు భక్తి రసామృత వృష్టివల్ల ఆత్మ పరిశుద్ధ మవుతుంది

* తాతలనాడు నేతులు త్రాగామంటే ఏం ప్రయోజనం ? నీ పరిస్థితి ఏమిటో ఏ విధంగా జీవిస్తున్నావో సంఘానికి తెలుసు. నీపూర్వవైభవాన్ని స్వయంగా చెప్పుకుంటే చులకనై పోతావు. నీ వెలుగు నీడలను గురించి చెప్పుకొంటే ఇతరులు చెప్పుకోవాలి.

* అధర్మాన్ని, అన్యాయాన్ని, అక్రమాన్ని ధైర్యంగా ఎదుర్కో. చివరకు నీకు విజయం లభిస్తుంది,

* నీకు ఇబ్బందులు కలుగుతాయనే భయంతో ఇతరులకు బాధ కల్గించటం భావ్యంకాదు.

* స్వరాజ్యాన్ని స్వారాజ్యంగా మార్చాలంటే ప్రథమంగా అవినీతి నిరోధకచర్యలు తీసుకోవాలి. లంచగొండితనం ఏనాడైతే సమసిపోతుందో ఆనాడే ప్రజలు సుఖపడతారు. అప్పుడే ప్రభుత్వానికి మంచిపేరు వస్తుంది.

* పాదరక్షలతో ముళ్ళున్నచోట నడిచినా ఏమీ ఇబ్బంది లేనట్లే నిస్వార్థంతో ఏపనిచేసినా అది శోభిస్తుంది.

* ఒక వస్తువు చేయి జారిపోయినప్పుడుగాని దాని సంపూర్ణ మైన విలువ గ్రహించలేం. అట్లాగే తల్లిదండ్రులు బ్రతికి ఉండగా వారి విలువ తెలియదు.

* నేతిబీరకాయలో నెయ్యి ఎంతఉందో కపట సన్యాసిలో అంత భక్తి ఉంటుంది.

* బెల్లం ఉంటే చీమలు వదలనట్లే, ఋణగ్రస్తులైతే రుణదాతలు వదిలిపెట్టరు.

* భగవంతునిపై మనసు కుదరాలంటే తగిన ప్రశాంత వాతావరణం ప్రధానంగా ఉండాలి.

* ఏగడ్డికరిచయినా సంపాదిస్తున్నవాడే ఘనుడు. లేనివాణ్ణి గడ్డిపోచగానైనా చూడరు.

* ఒకరు చేసేపని ఒకరికి నవ్వుగా ఉంటుంది. నవ్వుతున్న వారిని చూస్తే అవివేకమనిపిస్తుంది.

* ధర్మంగా ఉందామనుకొన్నా తన వ్యవహారం వచ్చేటప్పటికి మనసు అధర్మం వైపే మొగ్గుచూపటం చాలా ఆశ్చర్యం. మాయవల్ల మానవుడు మర్మాన్ని గ్రహించలేకపోతున్నాడు.

* బంధాలున్నంతవరకే బాధలు.

* కరివేపాకును సువాసనకోసం చారు కాచేటప్పుడు వేసి అన్నంలో పోసుకొనేటప్పుడు తీసిపారవేసినట్లే నిపుణుడైన వానిని యుక్తిపరుడు తన కార్యార్థం సమయానికి వినియోగించుకొని వదిలివేస్తాడు.

* పదిమందికి తెలిసేటట్లు భక్తునిలా పూజలుచేస్తూ చాటుగా ఖూనీలుచేసినా ప్రాణం పోస్తున్నాడంటారు. పీకవరకూ విషాన్ని ఉంచుకొని పైకి మధురాతి మధురంగా మాట్లాడుతూ

ఎన్నికొంపలు కూల్చినా, కొంపలు నిలబెడుతున్నాడంటారు. లోకంపోకడే ఇది!

* ఒక వ్యక్తినిగాని, ఒక సంఘాన్నిగాని ఒకేసారి నియమ నిబంధనలన్నీ రుద్ది తీర్చిదిద్దాలనుకోవడం విప్లవానికి మూలం.

* ఈనాడు ధనధాన్యాల కిస్తున్న విలువ విద్యా సంస్కారాలకు ఇవ్వకపోవటం విచారకరం.

* మనసులనుబట్టి కొందరు మనుషులు నడుచుకొంటారు. మనుషుల ననుసరించి కొందరి మనసులు నడుచుకొంటాయి.

* ఉన్నవాడు ఉన్నదగ్గరేఉన్నా ఊహాలుమాత్రం ఊళ్ళేలతున్నాయి. అన్నీ అమాంతంగా మింగేద్దామని చూకితే ఏదీ దక్కకుండా పోతుంది.

* ఇసుక నేల దున్ని బాగుపడినవారు, బంక నేల దున్ని చెడిపోయినవారు లేనట్లే. భగవంతునిపై భక్తి విశ్వాసాలతో జీవితయాత్రచేసి చివరకు చెడిపోయినవారూ, దుర్మార్గదుష్టత్వాలతో కాలం గడిపి ఆఖరుకు బాగుపడిన వారూ లేరు.

* బంగారానికి గీటుపెడితే మంచిదో కాదో తెలుస్తుంది. అయస్కాంతాన్ని పట్టిస్తే నాణెం ఎంతమంచిదో తెలుస్తుంది. మెతుకులు నొక్కి చూస్తే అన్నం ఉడికిందో లేదో తెలుస్తుంది. అట్లాగే ఒకరి మంచి చెడ్డలు వారి మర్యాదను బట్టే, మాటను బట్టే తెలుస్తాయి.

కాడి వెంకట కృష్ణారావు

* ఒకరికి విచారమైంది మరొకరికి వినోదం అవుతుంది.

* నిద్రలో నీపై చీమ పాకినా, నిన్ను దోమ కుట్టినా నీవు మేల్కోకుండానే తొలగిస్తావు. అట్లాగే ఎక్కడ ఉన్నా ఏమి చేస్తున్నా మాతను మాతృ భూమిని మరువకూడదు.

* ఇతరులను నీఆధీనంలో, నీచెప్పుచేతలలో ఉంచుకోవాలని ప్రయత్నించకు. నీమంచితనంతో వారే నిన్ను మనసారా అభిమానించి నిన్ను అనుసరించాలని కోరుకోవాలి.

* చక్కగా ముస్తాబై, గర్వంగాతిరుగుతూ,గడుసుగా మాట్లాడితే సరిపోదు. ఒకసారి మన శాస్త్రజ్ఞులను జ్ఞప్తికి తెచ్చుకుంటే మహత్తరమైన వాటిని కనిపెట్టి ప్రపంచానికి ఎంత మేలుచేశారో వారి తెలివితేటలు ఎంత గొప్పవో తెలుస్తాయి అప్పుడు నీవు నిష్ప్రయోజకుడవని తేలిపోతుంది సిగ్గుతో తలవంచుకుంటావు, నీలో పట్టుదల పెరుగుతుంది. నీవూ ప్రయోజకుడవవుతావు.

* కొబ్బరికాయలో నీరు ఎట్లాఉంటుందో అట్లాగే భగవంతుడు మనలోనే ఉంటాడు.

* కాకర్ల తగిలితే పుచ్చకాయ పెరుగుతుంది, గుమ్మడికాయ మురుగుతుంది. ఆ విధంగానే భక్తితో మెలిగితే మోక్ష సామ్రాజ్యాన్నలంకరిస్తావు. దుర్మార్గంతో సంచరిస్తే యమ యాతనలనుభవిస్తావు.

* అభివృద్ధిలోనికి వస్తున్నవారిని గురించి కొంతమంది నవ్వుతో చూస్తుంటే, వారు ఎప్పుడు తప్పటడుగు వేస్తారా, ఎప్పుడు మన

చెవిని పడుతుందా, ఎప్పుడు పదిమందికీ అల్లుదామా అనే ఆత్ర తతో సతమతమయ్యేది మరి కొంతమంది.

* వంద రూపాయలలో ఐదు రూపాయలు జారిపోతే ఎట్లా గయినా ఐదురూపాయలు పోయాయిగదా అని మిగిలిన తొంభై అయిదు రూపాయలు చేజేతులా పారవేయలేం కదా! ఆ విధంగానే జీవితంలో తలవని తలంపుగా పొరపాటు చేసి మంచి పేరు రాదు గదా అని చెడ్డగా మారిపోవటం అవివేకం.

* మనిషికి విద్య ప్రధానం, విద్యలేని మనిషికి అన్నీ వింతలే. అటుపై చింతలే.

* పరులకు నీ శక్తికి తగిన విధంగా ఉపకారం చెయ్యి. అందువల్ల అమితమైన ఆనందం, తృప్తి కల్గుతాయి.

* మంచివాని మంచిని గ్రహించలేరు. చులకనగాచూస్తారు. ఎప్పటికైనా ఆ మంచిని గ్రహించి పశ్చాత్తాపపడక మానరు.

* ప్రేయసీ ప్రియులకు ప్రేమోపాసన తీరదు. ఆవిధంగానే నిజమైన కళాకారునకు కళారాధనపై మమత మారదు.

* చిత్తశుద్ధితో నిర్వహిస్తున్న ధర్మం, న్యాయం ఉన్న ప్రతి కార్యంలోనూ విజయం లభిస్తుంది.

* ఉన్నవారిని పిండు, లేనివారికి పెట్టు.

* అలవాటుపడిన నోటినిగాని, మనసునుగాని ఆపటం చాలా కష్టం.

- తాడి వెంకట కృష్ణారావు

* భర్త భార్యను కొట్టటం, భార్య భర్తను తిట్టటం సమంజసంకాదు.

* బాగుపడేవాణ్ణి చులకనగా చూడటం, చెడిపోయినవాణ్ణి పరిహాసంచేయటం నీచబుద్ధికాక మరేమిటి?

* నిరుపేదలు ఎంతకష్టపడతారో అనుభవిస్తేగాని అర్థంకాదు.

* నీతులు చెప్పటం ఎంతోసులభం. ఆచరించటం ఎంతో కష్టం. భక్తినిగురించి బోధించటం ఎంతోతేలిక. భక్తితో మెలగటం ఎంతోకష్టం.

* మాటనిలకడలేని మనిషిని కొంతకాలానికి ఎవ్వరూ విశ్వసించరు. నిలకడలేని మనసుతో నీవు ఏపని చేసినా ఏమీ ప్రయోజనం ఉండదు.

* నాలోఏదైనా గర్వం ఉంటే నేను పదిమందిలో అవమానం పొందకుండా అగ్నిలో హారతికర్పూరం హరించి పోయేటట్లుగా నాలోఉన్న గర్వాన్ని నాలోనే హరించేటట్లు చెయ్యి భగవంతుడా!

* కాలం గడిచిపోయిన తరువాత విచారిస్తే ఏంలాభం? ముందే మేలుకొంటే ఎంతో బావుంటుంది.

* భగవన్నామాన్ని స్మరిస్తూ ఎదురయ్యే సుడిగుండాలను తప్పించుకుంటూ గమ్యాన్ని చేరటానికై ప్రయత్నించు. దేవుడు నీకు తప్పక చేదోడు వాదోడుగా ఉంటాడు.

* అల్లుడు అబ్బాయిలాగా అత్తవారింటో నడుచుకొంటే అంతకంటే కావలసిందేమిటి?

* కాలం మారింది. అప్పటివారికీ ఇప్పటివారికీ మాటలలో గాని, చేతలలోగాని, ఎంతో భేదం కన్పిస్తూంటి. ఈ కొత్తకు, ఆ పాతకు నిరంతరం సంఘర్షణ జరుగుతూనే ఉంటుంది. ఈ కొత్తపాతల మేలుకలయికే పురోభివృద్ధికి మూలం.

* ఎప్పుడూ సుఖమనుభవించేవారికి దాని అసలు విలువ తెలియాలంటే కొన్ని కష్టాలు కూడా పడాలి. అప్పుడే ఆసుఖానికి అర్థం ఏమిటో, దానిలో ఎంతఆనందం ఇమిడిఉందో తెలుస్తుంది. అట్లాగే ఎప్పుడూ కష్టాలుపడేవారు ఒకేసారి సుఖాన్నిపొందితే వారిఆనందానికి అవధులుఉండవు. మొదట్లో కష్టాలు అనుభవించి ఆతర్వాత సుఖం పొందినవారి ఆనందమే గొప్పది.

* జుట్టుచేతికి దొరికిందని సంబరపడకు. నీజుట్టు నీతాతలాంటి వాడిచేతి కందుతుంది. అప్పుడుగాని ఆబాధ అర్థంకాదు.

* ఒకరు ఆచరించి దానిని ఆచరించమని ఆజ్ఞాపిస్తే దానిలో ఒకవిధమైన విశిష్టత, దృఢశక్తి ఉంటాయి.

* ఇప్పటి స్థితిచూసి విర్రవీగిపోతాం. చివరిస్థితి ఆలోచిస్తే మనసు చివుక్కుమంటుంది. గుండెగుభేలు మంటుంది. ఎందుకీ దుర్బుద్ధి అనిపిస్తుంది.

* ఈ సంఘంలో అవివాహిత అయిన స్త్రీ అడుగు తీసి అడుగు వేయాలంటే ఎంత జాగ్రత్త వహించాలో అట్లాగే పేరు ప్రతిష్ఠలు పొందాలనుకొనేవారు కూడా అంత జాగ్రత్తగా నడుచుకోవాలి.

* పిల్లి కళ్ళుమూసుకొని పాలుత్రాగుతూ లోకులు చూడరనుకొంటుంది. అట్లాగే నిండు స్వార్థంతో ఉంటూ పైకి నిస్వార్థంతో ఉన్నట్లు నటించినా కాలక్రమేణా లోకులు గ్రహించకుండా ఉంటారా?

* ఎంతో ప్రేమతో చూసే మన శరీరమే మనతో రానప్పుడు పేరుప్రతిష్ఠలు, సిరిసంపదలు అంటే ఎందుకంత ప్రాకులాట!! ఎందుకంత పేరాస!

* యవ్వనం పువ్వులాంటిది సుమా!

* వ్యాపారంలో కోపం కూడనట్లే కాపురాలలో కలతలు కూడవు.

* లేకపోతే లేదు అని ఒక్కటే బాధ. అడగలేక అడగలేక ఒకరిని అడిగి లేదనిపించుకొంటే బాధ రెట్టింపవుతుంది.

* తప్పుకోలతో గడ్డిని ఏవిధంగా నీకి పారవేస్తామో ఆవిధంగానే భక్తితో అరిషడ్వర్గాలను దరికి చేరనీయకూడదు.

* దీపం దగ్గరఉంటే కన్పిస్తారనుకోవటం పొరపాటు. దీపానికి దూరంగా చీకటిలో ఉన్నవారు కన్పించరు. కాని

వారు చీకటిలో ఉన్నా దీపందగ్గర ఉన్న వారిని స్పష్టంగా చూడ గలుగుతారు. అలాగే కొందరు తమ తప్పులు తమకు తప్ప ఇతరులకు తెలియవనుకొంటారు. కాని సర్వవ్యాపకుడైన భగవంతుడు చీకటి మాయంతా చూస్తూనే ఉంటాడు.

* అనేక జన్మలలో నీవు ధర్మంగా, న్యాయంగా ఉన్నావు కాబట్టే ఉత్కృష్టమైన మానవ జన్మలో ప్రవేశించావు. ఈజన్మలో కూడా ధర్మం, న్యాయం తప్పకుండా నడిస్తే మోక్షం లభిస్తుంది. ఉత్కృష్టమైన మానవజన్మలో అవివేకివై అడ్డదిడ్డంగా సంచరిస్తే మళ్ళీ నీకు నీచ జన్మలు ప్రాప్తిస్తాయి. వైకుంఠపాళీ ఆటలో పెద్దపాము మింగితే క్రిందకు దిగినట్టు మళ్ళీ నీవు అష్టకష్టాలూ అనుభవిస్తూ అగ్నిపరీక్షలకు తట్టుకోలేవు. జాగ్రత్తగా మసలుకుంటే మంచిది.

* పసిపాపల మాటలు పదుగురికీ ముద్దు. భగవంతుని నామం భక్తులందరికీ ముద్దు.

* కట్టె వంకర పొయ్యి తీరిస్తే, నేరస్థుని వంకర న్యాయస్థానం తీరుస్తుంది.

* ధర్మానికి, న్యాయానికి అడ్డు చెపితే ఎంతటివారినైనా శిక్షించు. అంతిమ విజయం నీదే.

* భూమి తనచుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ

ఎట్లా తిరుగుతుందో ఆవిధంగానే మన పాపాలతో మనం నలుగుతూ ఇతరులు చేసే పాపాలుచూస్తూ, వింటూ కాలం గడుపుతున్నాం.

* దేవుడు లేని గుడి భక్తిలేని పూజలు ఒక్కటే.

* ఒక రూపాయి లాటరీకట్టి, మొదటి బహుమతి వచ్చినట్లు, మేడలు మిద్దెలు కట్టినట్లు, భూములు కొన్నట్లుగా ఎంత ఆనందిస్తారో అట్లాగే భక్తిభావంతో భగవంతునికై పరితపించాలి. ఆయన లీలలను తలచుకొని ఆనందించాలి.

* భార్యాభర్తలు తమ అంతరంగిక విషయాలు పరులకు చెప్పటమంత అవివేక మింకొకటి లేదు.

* యవ్వనం వరద వంటిది సుమా !

* ప్రజాప్రభుత్వంలోని పౌరులు ఎటు గట్టిగా గాలి వీస్తే అటే వాలిపోతారు.

* బ్రతికి చెడిన వారి ఇంట్లో ఉన్న కుక్క కూడా దాని ఠీవి వదల లేదు.

* దొండిగాతిని కండలు పెంచామని దండలుచరిస్తే ప్రయోజనం లేదు. దేశం సస్యశ్యామలంగా సిరిసంపదలతో విలసిల్లాలంటే మనం నిజమైన దేశసేవకులుగా తయారై మాతృభూమిపై మమతతో మెలగాలి.

* ఏదైనా పొరపాటు చేస్తే అది నీకు తప్పని తెలిసినా, పెద్దవారు తప్పని చెప్పినా వెంటనే ఒప్పుకో. కాని దబాయించకు. అది మంచి లక్షణం కాదు.

* నీ మిత్రుడు తప్పుదారిని పడితే ముప్పు వస్తుందని వెంటనే చెప్పు. తర్వాత ఎప్పుడో చెపితే రత్నం చేయిజారిపోతుంది. మట్టిలో కలిసి పోతుంది. తప్పని తెలిసినా ఒప్పుకుని మెప్పు వస్తుందని గొప్పకోసం "ఆహా!" అన్నావంటే ఆ తప్పుకు నీవు ప్రోత్సాహమిచ్చి పాడుచేసినవాడవవుతావు.

* ఎంత వెన్నెలయినా భరిస్తాం. కాని కాస్త ఎండ భరించలేం. ఆవిధంగానే ఎన్నిసార్లు పొగిడినా సహించగలం. కాని ఒక్కసారైనా తెగిడితే సహించలేం. మానవుని సహజగుణం కాబోలు.

* మన సంఘం అప్పుడప్పుడు మేడిపండు మేలిమికి మురిసిపోయి అల్పులకు అగ్రపీఠాసనమివ్వటం అధికులను అవమానపర్చటం జరుగుతుంది. అయినా సరైన సమయం వచ్చేటప్పటికి, మేలిమి అని భ్రమించింది మసిఅని తేలిపోతుంది.

* అయస్కాంతం ఏ విధంగా ఇనుము నాకర్షించు కుంటుందో ఆవిధంగానే భగవంతుడు నిజమైన భక్తులను దరిచేర్చుకుంటాడు.

* రక్తంపిండి, చెమటోడ్చే శ్రమ జీవుల కడగండ్లు తీర్చటానికి శాయశక్తులా ప్రయత్నించు.

శాడి వెంకట కృష్ణారావు

* తరచగా తరచగా వెన్నవచ్చేటట్లు సాధన చేయగా చేయగా ఫలితం కనిపిస్తుంది.

* డబ్బున్న కొంతమంది మహానుభావులకు లేని వాళ్ళను గురించి తేలికగా మాట్లాడటమనే జబ్బు ఒకటుంది. డబ్బులేని వాళ్ళను ఉన్నవాళ్ళు ఏ విధంగా గుంజీలు తీయించాలంటే ఆ విధంగా తీయించవచ్చు.

* ప్రాంతంగా సర్వశాస్త్రాలు చదివినా లేని కాంతి, శాంతాని కన్నది.

* బాలల నిర్మలమైన హృదయ ఫలకంపై పడిన ఏ విధమైన భావాలయినా వయసుతోపాటు పెరిగి పెద్దవవుతాయి. అందువల్ల మంచి భావాలను బాలల హృదయ ఫలకాలపై పడేటట్లు చేయటం ముందుముందు దేశానికెంతో శ్రేయస్కరం.

* మధురగానం వింటున్నప్పుడు బయట ప్రపంచాన్ని మరచిపోయేటటు భగవంతుని ధ్యానించేటప్పుడు సర్వం మరచిపోవాలి.

* ఉపన్యాసకుడు తనకు తోచిన నూతన భావాలను పదిమందికీ విన్పించేవరకూ ఆగలేడు. రచయిత కాగితంపై వ్రాసేవరకు ఆతపనను తట్టుకోలేడు.

* అరిషడ్వర్గ జ్వాలలలో కాలిపోతున్న ఈ శరీరానికి కాంతి ఏది? కళ ఏది? రామ నామ స్మరణే దీనికి తగింది.

* ఎంత ప్రజ్ఞగలవాడైనా, ఎంత పేరు ప్రతిష్ఠలు ఉన్నవాడైనా పరస్త్రీ వ్యామోహం వల్లే పతనమై పోతున్నాడు.

* భగవంతుని సృష్టిని ప్రాణప్రదంగా చూడాలి, ప్రేమించాలి కాని హింసింప కూడదు.

* శ్రమించు. అధికంగా శ్రమించు. భగవంతునిపై భారం వెయ్యి. అంతేగాని భగవంతుని విశ్వసించాను సత్ఫలితం రమ్మంటే రాదు.

* గౌరవానికి భంగంరాకుండా ఎంతగానో ప్రయత్నిస్తాడు బ్రతికి చెడిన పెద్దమనిషి.

* నమ్మి విడిచి పెడితే మోసం చెయ్యటం న్యాయంకాదు. నిన్ను నీవే మోసం చేసుకోవటం వంటిది సుమా!

* ఐహిక సుఖాలను దూరంచేస్తూ ఆముష్మిక సుఖాలను దగ్గర జేర్చే సాధనం రామనామమే.

* పాశంతో గోవును కట్టివేసినట్లే భక్తితో భగవంతుని ఆకట్టుకోవాలి. తెంచరాని, తుంచలేని రాగద్వేషాదులను రామనామ స్మరణ ఒక్కటే నామ రూపాలు లేకుండా నశింపజేస్తుంది.

* కెమెరాతో ఫొటో ఎట్లా తీస్తున్నారో అట్లాగే భక్తితో భగవంతుని దివ్యస్వరూపాన్ని తిలకించాలి.

* నిన్ను అవమానిస్తున్నారని అణిగి పోవద్దు. అతిధైర్యంగా ప్రతి ఒక్క అవమానం నీ భవిష్యత్ జీవితమార్గంలో ఒక్కొక్క మెట్టుగా భావించి, సహనం వహించి సాగిపో, సాఫల్యం పొందుతావు.

* కాలం కర్మం కలిసిరానప్పుడు ఎవరెన్ని ప్రయత్నించినా సత్ఫలితం సాధించడం చాలా కష్టం.

* ఎంత ముసలివారైనా చావుందని మరచిపోయి ఆశలతో, దురాశలతో దూకుతారు.

* విమర్శకు వెలవెల పోయేవాడు వివేకవంతుడు కాదు. అర్థంలేని విమర్శ లెక్క చేయనక్కరలేదు. విలువైన విమర్శ మనకెంతో మేలు. విశాలదృక్పథం కల వారికి కావలసిందే సద్విమర్శ.

* ఒకజీవిని ప్రతిక్షణం హింసించటం పరమనీచం, మహాపాపం. అది సంకుచిత తత్వానికి చిహ్నం.

* చిన్నారి పాపల చిరునవ్వులులా నిష్కల్మషత్వంతో మానవుడు తోటి మానవుని ప్రేమించిననాడే ప్రపంచం ప్రేమమయ మవుతుంది.

* ఒకరి సొమ్ము దోచుకుతింటే, ఒకరిపై ఆధారపడితే సిగ్గు

పడాలి గాని చిత్తశుద్ధితో కష్టపడి చేసే ప్రతిపనీ గౌరవ ప్రదమైందే.

* ఒకరిని బలహీనుని చేసి పదిమందీ ఏకమై మీదపడితే బలహీనుని పక్షం చేరి పోరాడు. కష్టాలనుభవించినా సరే అది నీకు అసలైన విజయం.

* విచక్షణజ్ఞానంఉన్న మనిషి - మనిషిగా జీవించటం నేర్చుకోవాలి.

* కన్నీటిని తుడిచి పన్నీటిని జల్లవలసిన వారే కఠినంగా ప్రవర్తిస్తే కాపాడేదెంకెవరు?

* మండుటెండకు తట్టుకోలేని మానవుడు నీడలోనికి పరుగెత్తేటట్లే తన దుర్మార్గాలను పైకి కనిపించకుండా దాచుకొని మానవుడు "మంచిపేరు" అనే నీడ క్రింద ఉండటానికి ప్రయత్నిస్తాడు.

* సుముహూర్తమేమిటి? దుర్ముహూర్తమేమిటి? అష్టమి ఏమిటి? అమావాస్య ఏమిటి? భగవంతుడు సృష్టించిన కాలం అంతా మనకు శుభమైనదే.

* కాసే చెట్టునే నల్గురూ నాల్గురాళ్ళతో కొట్టేటట్లు మంచి పనులను చేసేవారినే నల్గురూ నాల్గుమాటలంటారు.

తాడి వెంకట కృష్ణారావు

* నియమాలను పాటించాలేగాని నిగ్రహాన్ని పొందట మెంత? విజయాన్ని సాధించటమెంత?

* పరిశీలనా దృష్టితో ప్రకృతిని పరికిస్తే పరమానందం కలుగుతుంది. పసందైన కవిత్వం పరమానందం నుండే ఉద్భ విస్తుంది.

* మండే సూర్యునిలా మాట్లాడుతూ నిండుచంద్రునిలా ప్రేమతోచూసే మహామహులున్నారు. అల్పుడవై అర్థం చేసుకోకుండా మాట్లాడకు. నిజం తెలుసుకొని మసలుకో.

* ఆడీ, ఆడీ అబద్ధమాడితే ఆ అబద్ధానికి వంద అబద్ధా లాడాలి. అందుకే అసలు అబద్ధమాడకు.

* గడచినకాలం తిరిగి రావటం కలలోనిమాట. విలువైన కాలాన్ని వృథాచేయకుండా వినియోగించుకోవాలి.

* మంచి సంపాదించటం డబ్బు సంపాదించటంకంటే గొప్పది. కాని డబ్బుఉంటే మంచి సంపాదించటం కూడా సులువే.

* దేశభక్తి ప్రతి యువకుని హృదయంలో నాటు కోవాలి. ఆనాడే దేశానికిశోభ. అదే దేశసంపద.

* అర్థంకాకపోయినా అనుకరించటం అధికం. ఆలోచనలు అమితం. ఆచరణలు అల్పం.

* వయసు వచ్చిన నిరక్షరాస్యుడు విద్యకోసం ఎంతతపాతపా లాడతాడో, కన్య విద్యావంతుని వరునిగా పొందాలని ఎంతగా ఉవ్విళ్ళూరుతుందో అంతటి మక్కువతోను, ఆసక్తితోను భగవంతునికై ప్రతిఒక్కరూ ప్రాకులాడాలి.

* తేనెటీగలను జాగ్రత్తగాతోలి తేనెను ఎట్లా తీసుకొంటు న్నారో అట్లాగే ఐహిక సుఖాలకు దూరంగా ఉంటూ మోక్షానందాన్ని గ్రోలాలి.

* కాలువ పారుతున్నపుడు పైన అలలు ఏవిధంగా కన్పిస్తాయో ఆవిధంగానే మానవజీవితంలో సుఖదుఃఖాలు కల్గుతూనే ఉంటాయి.

* ఒక్కొక్కసారి తీరని అవమానాలను పొందుతాం. ఒక్కొక్కమారు అద్భుతమైన గౌరవాలు అందుకుంటాం. గమ్యాన్ని చేరే ప్రయత్నంలో ముళ్ళబాటలు అడ్డుపడవచ్చు. పూలదారులు దొరకవచ్చు. అన్నిటికీ సిద్ధంగా ఉండే ముందడుగు వెయ్యాలి.

* డబ్బున్నపుడు నీచుట్టూతిరిగి ఆదరాభిమానాలతో, అతి వినయంతో ఆరాధించినవారే నీవు పేదవైనపుడు నీగతిఎట్లా ఉంటుందో చెప్పటానికే చేతకాదు.

* దీపాన్ని చూపు మురిసిపోయి, మీదపడి పురుగు ఏమి

అనుభవిస్తుంది? పరస్త్రీలను చూసి పొంగిపోయే పురుషుడు ఎంత అనుభవిస్తాడు?

* నీవు పేదస్థితిలో ఉన్నప్పుడు ఎవరు నిన్ను మనసారా ప్రేమించారో, ఎవరునీకు అండదండగా ఉన్నారో వారే నీకు నిజమైన ఆప్తులు. అవకాశవాదులను విశ్వసించకు.

* పిల్ల చెప్పిన చాడీలు తల్లి వినటం నేర్చుకొంటే రేపు అత్తింటికివెళ్ళిన పిల్లద్వారా తల్లివింటూ బాధలు పడవలసి వస్తుంది. అందుచేత ఆ దురలవాటు మొదట్లోనే మాన్పించాలి.

* నిష్కళంకంగా ఉండి నీతులు చెప్పటం సహజసౌందర్యం వంటిది. గోతులు తీస్తూ నీతులు నేర్పటం కృత్రిమ సౌందర్యం వంటిది.

* చల్లని నీటిలోనేకదా విద్యుత్ పుట్టిందని అంటుకుంటే ప్రాణంతీస్తుంది. అంతేగాని నీచకులంలో జన్మించినంత మాత్రాన ఆయన స్థానానికి ఇవ్వవలసిన గౌరవం ఇవ్వకపోతే తగిన ఫలితం అనుభవించవలసి వస్తుంది.

* జననీ జనకులను నిందించే వారితో మాట్లాడినా, చూచినా, తాకినా పాపం కల్గుతుంది.

* తమకున్నంత తెలివి, తమకున్నంత బుద్ధి పరులకు లేదనుకుంటారు. అప్పుడేవారు పతనం చెందటానికి సమయం ఆసన్నమైందని గ్రహించాలి.

* ఒక్కొక్క నాటకంలో ఒక్కొక్కరకమైన పాత్రను ప్రముఖనటుడు నటించేటట్లు భగవంతుడు ఒక్కొక్కమతంలో ఒక్కొక్క పేరుతో అవతరిస్తాడు. నటుడు ఒక్కడే, పాత్రలు మార్పు, దేవుడు ఒక్కడే, పేర్లుమార్పు.

* అన్నదమ్ముల మధ్య, అక్కచెల్లెళ్ళమధ్య, భార్యాభర్తల మధ్య విభేదాలను కల్పించి వినోదంతో చూసి మురిసిపోయే వారికి వినాశకాలం దాపురించిందని గ్రహించాలి.

* నీవు ఎన్నికలలో అభ్యర్థిగా పోటీకి నిలబడేటప్పుడు నీవార్డులో ఉన్న ఓటర్లందరితోను ఎంతమంచిగా ఉంటావో అంతమంచిగా ఎల్లపుడూ ఉంటే సమాజమే బాగుపడుతుంది.

* ఆశలేకపోతే అభివృద్ధిలేదు. కాని దురాశఉండకూడదు. దుర్దినాలు ప్రాప్తిస్తాయి.

* దయామయుడైన భగవంతుని నిందించకు. నీప్రయత్న లోపమే నిన్ను ఈ దుస్థితికి ఈడ్చింది.

* వినయ విధేయతలుగల విద్యావంతుడైనా, ఉద్యోగస్థుడైనా, ఉన్నతపదవి గలవాడైనా ఉన్నవారిదగ్గర చులకనే.

* జూదమాడి బాగుపడినవారులేరు. బాగుపడినా త్వరలోనే చెడిపోతారు.

* భక్తే చిత్రం, భగవంతుడే విచిత్రం, అతని లీలలు మరీ విచిత్రం.

* జీవితంలో క్లిష్టసమస్యలు ఎదుర్కోవటానికి సంసిద్ధుడవై ఉన్నపుడే మనిషిగా మనగలుగుతావు.

* ప్రాయశ్చిత్తం తరువాత పశ్చాత్తాపం కూడదు.

* నీటిలో మొసలిలా ఎందుకలా మిడిసిపడతావు. స్థానం తప్పిందా నీపాట్లు కుక్కలు కూడా చూడవు.

* అడగనిదే అమ్మయినా పెట్టదంటారు. అట్లాగే కష్టాల నుండి కడతేర్చమని వేడితేగాని దేవుడైనా దయదలచడు.

* అత్తమాటవిని అణకువగా ఉండాలని కోడలికుండదు. కోడలిని కన్నకూతురిలా చూసుకుందామని అత్తకుండదు.

* ఆత్మబలమే సమస్త కార్యాలలో వజ్రసంకల్పం వీడనీయదు.

* కలిమిలో దేనినైతే సంతోషంతో త్యాగం చేశామో లేమిలో దానికై తలచుకొని ఆశపడతాం.

* కొందరు కొన్నికొన్ని సిద్ధాంతాలను అనుసరిస్తూ ఉంటారు. ఆ సిద్ధాంతాలను మార్చాలంటే హరిహరాదులకైనా అశక్యం.

* తాము ఎంతపొరపాటు చేసినా కప్పిపుచ్చుకుంటారు. ఇతరుల గోరంత తప్పులను కొండంతలుగా సృష్టించి ఎదుటి వారిని నానాబాధలు పెడతారు. ఇదిమానవనైజం. కాని ఇతరుల తప్పులను వెదికేముందు తాము తప్పులేమైనా చేశామో లేదో ఒకసారి వెనుకకుచూసి ఎదుటివారికి తప్పుని గట్టిగా చెప్పమనండి. అప్పుడు నోరు కదపలేరు. అహంకారం మటు మాయమౌతుంది. సిగ్గుపడతారు. సానుభూతిని ప్రకటించక మానరు.

* అన్నీ ఆకులే. వేపాకు చేదు, చింతాకు పులుపు. అందరూ మనుషులే. మనిషినడతనుబట్టి మర్యాదివ్వటం మన విధి.

* శాంతమూర్తికోపం శాపంవంటిది.

* తెలియకుండా మోసపోయారంటే దానిలో కొంత అర్థం ఉంది. కాని అన్నీ తెలిసే మోసపోవడం అవివేకం.

* నిర్మలమైన మనసుతో, నిశ్చలమైన మనసుతో, మధుర మైన ఆనందంతో భగవంతుని ధ్యానించాలంటే తగిన ప్రశాంతత అవసరం.

* నీకు అధికారం, డబ్బు ఉన్నప్పుడు అందరికీ అతి సన్నిహి తుడులా అగపడతావు. నీవు దుస్థితిలో ఉన్నపుడు ఎవరి దృష్టి లోకి పోజాలవు.

* దూరపు కొండలు నునుపు అని ముచ్చటపడవద్దు. నిదానించి నిజమేమిటో తెలుసుకో.

* కొందరు హాస్యాన్ని సహజంగానే ఒలికిస్తారు. మరి కొందరు హాస్యాన్ని సృష్టిస్తారు. అట్లాగే కొందరికి తలవని తలంపుగా భక్తిఅలవడుతుంది. మరికొందరు బుద్ధిపూర్వకంగా నవనాడులూ బంధించి భక్తితో ఉండాలని ప్రయత్నిస్తారు.

* మంచిని వంచటం తేలికే కాని చెడ్డను ఛేదించటం చాలా కష్టం.

* పనిచేయటం ప్రతి ఒక్కరి ధర్మం. తన జానెడు పొట్ట నింపుకోవడమే కాక తన నీడను తలదాచుకొనవచ్చిన వారందరినీ సక్రమ మార్గంలో నడిపిస్తూ తాను నడవటం ప్రతి ఒక్కరి విధ్యుక్తధర్మం.

* అరిషడ్వర్గాలను నిరసించి దరిజేరనీయకుండాఉంటే భగవంతుని కరుణకు పాత్రులవుతారు.

* ఆత్మ విశ్వాసంతో ఉత్సాహాన్ని, ఉద్వేగాన్ని క్రమశిక్షణతో, క్రమపద్ధతిలో నడిపితే ఆశయసిద్ధి అతిసునాయాసం.

* మనం నిద్రించేముందు పడకపై పడుకొని ఆరోజు చేసిన సత్కార్యాలు, హాయిగొల్పే సన్నివేశాలు తలుచుకొని ఎంత ప్రశాంతంగా నిద్రపోతామో అట్లాగే మన జీవితంలో అధిక

భాగం మానవసేవకై, భగవత్సేవకై వినియోగించి చివరకు మరణ శయ్యపై ఉన్నపుడు మన జీవిత మధురానుభవాలను స్మృతిపథంలోకి తెచ్చుకొని ఆనందంతో హాయిగా ప్రాణాలు విడుస్తాం.

* స్త్రీలు బంగారాన్ని ప్రాణప్రదంగా చూసుకుంటారు. వారి ప్రాణాలొకెత్తు, బంగారం ఒకెత్తు, బంగారంకోసం చోరులు ప్రాణం తీయటానికైనా సంశయించరు. అంత విలువగా భావించే బంగారాన్ని మాతృదేశ రక్షణకు కానుకగా సమర్పించడం వారి అద్వితీయ దేశభక్తి కాక మరేమిటి?

* మనం మట్టితో తయారుచేసిన కుండను పగులగొట్టాలంటే చేతులారా పగులగొట్టలేంగదా! అలాంటప్పుడు దేవుడు సృష్టి చేసి, ప్రాణంపోసినజీవిని ఎందుకు ఇలా నశింపజేయటం? ఏమిటో ఈ సృష్టి రహస్యం ?

* ఏకోదరులలో ఒకరి నొకరు ద్వేషించుకొంటూ ఉంటే వారిని చూచి పరులు అసహ్యించుకొని అపహాస్యం చేస్తారు.

* ప్రేమించకు. అధికంగా ప్రేమించకు. ప్రేమించావా నీవు బాధపడవలసి ఉంటుంది.

* తన కార్యాన్ని సఫలం చేసుకోవడానికి ఎవరి దగ్గర చెప్పవలసిన తీపిమాటలు వారికి హృదయపూర్వకంగా చెప్పుతున్నట్లు నటిస్తాడు నయవంచకుడు.

* అమ్మతరపు చుట్టాలను ఆత్మీయులుగాను, నాన్నవైపు చుట్టాలను చుట్టాలుగానే పిల్లలు భావిస్తారు. అది సనాతనంగా వస్తున్న సహజగుణం.

* ముక్కుసూటిగా ప్రవర్తించకుండా కాలానుగుణంగా ప్రవర్తిస్తాడు కార్యసాధకుడు.

* ఒకరి ఆచారవ్యవహారాలు ఇంకొకరికి నచ్చవు. వారికి నచ్చవని మీరు మానుకొంటారా ? అది సక్రమమైనప్పుడు వక్రమని చెప్పి వీరిని నొప్పించటం తప్పుకదా !

* అమ్మ గారాబమే అబ్బాయి అభివృద్ధికి అప్పుడప్పుడు అవరోధం అవుతుంది.

* నీవు ఇంటికి వచ్చినవారితో మంచిగా మాట్లాడి మర్యాద చెయ్యి. మనసులో ద్వేషంఉన్నా తెలనీయకు. కొంతకాలం ఓర్పువహిస్తే నీలోద్వేషం నశిస్తుంది. అవతలివారు తాము చేసిన అపకారాలకు సిగ్గుపడి అతి ఆప్యాయతతో నిన్ను ప్రేమిస్తారు.

* మానవులు మండుఎండలోనైనా ఉండలేరు. మహాచలిలోనైనా ఉండలేరు. మంచిగా ఉండమన్నా ఉండలేరు. మరీచెడ్డగా మారమన్నా మారలేరు. మంచిచెడ్డల కలయికతో జీవితనౌక సాగుతుంది.

* ఒకరు అయాచితంగా ఇంకొకరికి సహాయం చేయదలచారంటే వర్తమానంలోగాని భవిష్యత్తులోగాని ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గాని రెట్టింపులాభం ఆశించి చేస్తున్నారని గిట్టనివారు అంటారు. అవన్నీ పట్టించుకోవద్దు.

* కాలంతీరనప్పుడు మృత్యుముఖం నుంచైనా తప్పించుకొంటారు. కాని అది సమీపించినప్పుడు పంచామృతం సేవించినా అరక్షణమైనా నిలువలేరు.

* గతాన్ని స్మృతిపథంలోకి తెచ్చుకొంటూ భవిష్యత్తుపై తీయని ఆశలతో కలలుకనేవారుండటం సహజమే.

* లోపంలాగా సంఘానికి కన్పిస్తే పకపకానవ్వుతుంది. పళ్ళుగిలిస్తుంది. అదిలోపం కాదని చెప్తే తాపంతో కోప్పడుతుంది. నిజానికితావు లేదంటుంది. మీద విరుచుకు పడుతుంది.

* పాపంచేసి పశ్చాత్తాపం పొందితే హారతికర్పూరంలా హరించుకు పోతుంది. మళ్ళీమళ్ళీ పాపంచేస్తూ పశ్చాత్తాపం నటిస్తూఉంటే పాపం పదిరెట్లవుతుంది. దానిని మోయలేక, త్రోయలేక అష్టకష్టాలు అనుభవిస్తావు.

* మనం మంచితనంతోను, నిష్కల్మష సేవలతోను పరుల మనసులను అలరించాలి. అవసరమైతే మనప్రాణాలు కూడా ఇవ్వటానికి వెనుకంజ వేయకూడదు.

తాడి వెంకట కృష్ణారావు

* అవసరమొచ్చినపుడు అతివినయంగా ఉండి అన్నీ ఉన్నప్పుడు అదిరిపడకూడదు.

* నువ్వు నాటకమాడుతున్నావంటాడు. తాను ఆడే నాటకం తాను తెలుసుకోంటే ఇతరులను అంతగట్టిగా అనలేడు.

* సంకల్పం సరిగా నిల్పితే సాధించటం సులభమే.

* పెట్టిదెప్పటం మానవులకు పుట్టుకతో వచ్చినబుద్ధి. అందువల్ల అన్నారని బాధపడటం అనవసరం.

* మానవమాత్రుడవైన నీవు అజాతశత్రువు కావాలని కోరుకోవటం తెలివితక్కువతనం. నీధర్మాన్ని నిజాయితీతో నిర్వర్తించు. అంతే.

* ప్రేమతో మాట్లాడేవారినే పరిహాసిస్తారు. చంద్రునిలో మచ్చనే పదేపదే చారడేసి కళ్ళతో చూస్తారు.

* అమాయకుడని భ్రమపడకు. ఆ మాయకునితో అజాగ్రత్తతో కాకుండా జాగ్రత్తతో మాట్లాడు.

* పొరలి వచ్చే కష్టాలు, తరలి వెళ్ళే ఇష్టాలు.

* ఎంత అవసరమొచ్చినా అప్పుచేయకు. అది నీపరువుకే తీరని దెబ్బ. నీమాటకే పరమ శత్రువు.

* ఇసుక అంటుకుంటే శుభ్రంచేసుకోవటంవంటిది మంచి వారితో వాదన. బంకమట్టి అంటుకొంటే కడుక్కోవటం వంటిది చెడ్డవారితో వాదన.

* కొందరి స్థితిగతులు మంచిగా మారేకొద్దీ గొంతు పెరుగుతూ ఉంటుంది లేదా తగ్గుతూ ఉంటుంది.

* డబ్బుపిచ్చి ఎంత నీచానికైనా దిగజారుస్తుంది. అందుకే ఆ విషవలయంలో పడి గిరగిరా తిరగవద్దు

* సూర్యకిరణాలు ఉదయం సాయంత్రం పొడవుగా ఉంటున్నట్లే మానవులు బాల్యవృద్ధాప్యాలలో ఇంచుమించు ఒకే స్థితి కలిగి ఉంటారు.

* వసంత కాలంలో కమ్మని కవిత కదనుత్రొక్కుతూ కవుల గుండెలు కళకళలాడుతుంటాయి. వేయి స్వర్గాలలోనైనా కలగని ఆనందం కమ్మని కవితలో కలుగుతుంది.

* రవికి తీక్షణమైన చూపులు, కవికి నిశితమైన ఊహాలు ఉంటాయి.

* అయ్యో పాపంఅంటూ నటనగా సానుభూతిని ప్రకటిస్తూ స్నేహితుల గుట్టును తెలుసుకోవటానికి తహతహలాడుతారు. విషయం తెలుసుకొని వారిని లోలోన హీనంగా చూడటం సాధారణమై పోతుంది.

* పాపాలు చేసిన దుర్జనులు పాపాలలోనే దహించుకు పోతారు. పుణ్యాలు చేసిన సజ్జనులు పుణ్యాలతోనే పరిశుద్ధు లవుతారు.

* ఒకవంక తాము అపకారం చేస్తూనేమళ్ళీ ఎదురుతిరిగి ఇంత అపకారం, అన్యాయం చేస్తావని కలలో కూడా అనుకోలేదు అని అంటారు మడతపేచీ మనుషులు.

* తగువుపెంచి తమాషాగా చూసేవాళ్ళు ఎంతోమంది. తగదుబాబూ తగువు అనేవాళ్ళు కొద్దిమందే.

* నూనెరాచుకొంటే చేతులకు పనసపండు జిగురు ఎట్లా అంటదో అట్లానే గుణంగల స్త్రీపురుషులు ఎవరితో కలసిమెలసి తిరిగినా ఏమీఫరవాలేదు.

* ప్రశాంత వాతావరణం పాడుచేయటం, నిశ్చలమైననీటిలో రాయి విసరటం నీచుని లక్షణం.

* తల్లిదండ్రులు చెప్పేదంతా అక్షరాలా పాటించమని బాధించటం లేదు. కాని వారికి తోచినంతవరకుబిడ్డల అభి వృద్ధికి మంచిదనే చెపుతారు. దానిని అర్థంచేసుకొని వారిమాట లను తిరస్కరించకుండా సాధ్యమైనంత వరకూ ఆచరించటం మంచిది.

* కయ్యానికి కాలుదువ్వే మనస్తత్వంగలవారివద్ద సహనం

వహించి చిరునవ్వు చిలకాలి. కలహానికి కలహం తోడైతే కలిగేది అస్తవ్యస్త పరిస్థితి. మిగిలేది అశాంతి.

* అలనాటి రూప, శబ్ద, గమనాది విషయాలు మనోనేత్రాలతో తిలకించవచ్చు, ఆలకించవచ్చు.

* దారిలో విలువైన వస్తువు కన్పిస్తే నలుదిక్కులూ పారజూచి వెంటనే దాచేసి గంపెడాశతో గమ్యాన్ని త్వరగా జేరి రహస్యంగా దాన్ని ఎన్నో మార్లు చూసి ఎట్లా మురిసిపోతామో అట్లాగే జీవిత పథంలో పయనిస్తున్నపుడు భక్తిని అంత ఆత్రుతతో చేకొని సాగుతూ, భగవంతుని చూడాలన్న ఆశతో, భక్తిలో మునిగి తేలుతూ పరమానందాన్ని పొందాలి.

* ఒక కార్యాన్ని తలపెట్టినపుడు దానిని గురించి విశాలమైన భావంతో, దూరదృష్టితో, ప్రతి అంశాన్ని క్షుణ్ణంగా పరిశీలించి అడుగు వేస్తే సత్ఫలితాన్ని పొందవచ్చు.

* విద్యార్థులు పరీక్షలు వ్రాస్తున్నప్పుడు ఒక్క క్షణమైనా వృథా కాకుండా సద్వినియోగం చేసేటట్లు భావి జీవితంలో కూడా కాలాన్ని సద్వినియోగం చేయాలి.

* పచ్చి ఈతాకులతో పని చేయటం వంటిది ధన మదాంధులతో మెలగటం, ఎండు ఈతాకులతో పనిచేయటం వంటిది నిరహంకారులైన ధనవంతులతో మెలగటం.

తాడి వెంకట కృష్ణారావు

* వినయ విధేయతలుగల విద్యావంతుడైనా, ఉద్యోగస్థుడైనా, ఉన్నతపదవిగల వాడైనా ఉన్నవారి దగ్గర చులకనే.

* బ్రతికున్నంతకాలం భగవంతుణ్ణి తలవనైనా తలవకుండా తనవారికోసం రేయింబవళ్ళూ తపించిపోయేవారు మరణిస్తే మరుక్షణంలోనే వాకిట్లో వేసెస్తారు. కొన్ని గంటలలోనే తొందరపడి ఆ వీధినుంచే శ్మశానానికి తరలించుకపోయి కాల్చేస్తారు లేదా పాతేస్తారు.

* పక్షిపగలంతా ఆకాశంలో ఎంతఎత్తుకు ఎగిరినా సాయంత్రమయ్యేసరికి తనస్థానాన్ని చేరుకొంటుంది. ఎవరు ఎన్నివిధాలుగా మిడిసిపడినా తుదకు మరణిస్తున్నారు. ఈ సత్యాన్ని తెలుసుకొని మానవుడు భగవంతుని పదయుగళాన్ని అందుకోవటానికి ప్రయత్నించాలి.

* శిఖరాగ్రాన్ని చేరుకుందామని పాతాళంలోకి పడిపోతున్నావు. నీ ప్రజ్ఞకుతోడు దైవ సహాయంకూడా తోడైతేనే నీవు ఆశించింది సాధించగలుగుతావు.

* నటుడు తన అమోఘమైన నటనతో, రచయిత తన అమూల్యమైన రచనలతో సంఘాన్ని సంస్కరించాలి.

* మాటల పొందిక పాటకు అందం. భగవంతుని రూపం భక్తులకు పరమానందం.

* కన్నీరు కావాలా కడివెడు ఇస్తాం. సానుభూతి కావాలా సర్వదా ఇస్తాం. ఆర్థిక సహాయమూ అడగవద్దు అంటారు.

* అతి ఎప్పుడైనా అనర్థం. మితంఎల్లపుడూ ఆచరణీయం.

* నాల్గురాళ్ళు సంపాదిస్తున్నవాని ఇల్లాలు, భర్త పద్ధతులు, మాటలు నచ్చకపోయినా ఎట్లాగో సరిపెట్టుకొని సంసారం నడుపుతుంది.

* మెత్తమెత్తని మాటలకు మత్తెక్కి చిత్తయిపోయి చివరకు తెలుసుకొంటే ఒరిగిందేమిటని బాధపడకు. నిన్నుచూసి నీతరువాతవారు బుద్ధిగలిగి ఉంటారు.

* పిల్లిగాని, పుల్లలుగాని, విధవగాని, శవంగాని, కొత్త కుండగాని ఎదురైతే అశుభం జరుగుతుందని, గోవుగాని, ఏనుగు గాని ఎదురైనా, గుడిగంటలుగాని, మంగళవాద్యాలుగాని వినిపించినా శుభం జరుగుతుందని భావించటం మూఢనమ్మకమే.

* చీకటిలో చల్లగా గొంతులు కోయించి, తెరముందు మెల్లగా న్యాయానికి మేకులు వేస్తున్నారు.

* మానవులు భగవంతునికి రెండుచేతులతో ఎట్లా నమస్కరిస్తున్నారో అట్లాగే దేశం ప్రమాదస్థితిలో ఉన్నపుడు స్త్రీ పురుష భేదంలేకుండా రాత్రింబవళ్ళు ఎవరి రంగంలో వారు కష్టపడి పనిచేయాలి.

* తుంగముబ్బలు మొలిచే పొలంలో బంగారుపంటలు పండించటానికి ప్రయత్నించేటట్లు దారితప్పిన మనిషిని మనిషిగా మార్చడానికి ప్రయత్నించాలి.

* అతివాగుడు వాగే వారితో కలిసిమెలిసి తిరగటం బ్రేకులు లేని బండిలో ప్రయాణం వంటిది.

* కమనీయరూపంతో ఈ గమ్మత్తు కన్నులకు ఒకప్పుడు కన్పించినవస్తువు మరొకప్పుడు మసికంటే హీనంగా కన్పించ వచ్చు.

* నిజాయితీ పరునిపై అనాదరణ, అవిశ్వాసం, అమృత హృదయునిపట్ల అసూయ, ద్వేషం, ఆదర్శజీవిపై ఆరోపణలు, అపనిందలు, కాని ఎంత మసిపూసినా మేలిమి బంగారం నిగనిగ లాడుతూ మెరుస్తూనే వుంటుంది.

* సుగంధమైనా, దుర్గంధమైనా మోసేదివాయువు. అనుభవించేదీ, ఆనందించేదీ గ్రహీతలు. దుర్మార్గుడైనా, సన్మార్గుడైనా ఓర్చేవి తల్లిదండ్రులు.

* గాలినుండి గంధాన్ని, జలంనుండి రుచిని తీసిచూపించ లేనట్లే సర్వవ్యాపకుడైన పరమేశ్వరుణ్ణి సర్వులఎదుటా సాక్షాత్కరింపజేయటం సాధ్యంకాదు.

* పదవివున్నప్పుడుగాని, డబ్బువున్నప్పుడుగాని పలుసార్లు ప్రదక్షిణ చేసినవారు అవి కాస్త హుళక్కి అయిననాడు ఎక్కడి వారక్కడ పలాయనం చిత్తగిస్తారు.

* మరణించే వరకూ మానవసేవ చేయాలనే తలంపు ఉండటం మంచిఆశయమే కాని స్వార్థచింతనతో పిచ్చెక్కి పోవటం ఎంతమాత్రం కూడనివి.

* డంబమైన మాటలతో రచన సాగించ నక్కరలేదు. నిర్మాణాత్మకం, నీతిదాయకం, అయిన రచన సామాన్య భాషలో ఉన్నాచాలు.

* ఎలుకను పట్టేపిల్లిలా, చేపనుపట్టే కొంగలా అసూయా పరులు సమయం కోసం కాచుక్కూర్చొని వుంటారు. వారితో కలిసిమెలిసి తిరగవలసి వచ్చినపుడు జాగ్రత్త వహించాలి.

* శిష్యుడు పైకివస్తే గురువు గర్వించాలి. కాని ఈర్ష్య అసూయలు పొందరాదు. పైకివెళ్ళే కొద్దీ శిష్యునికి గురుభక్తి పెరగాలి. కాని నిర్లక్ష్యం, నిరాదరణ చూపరాదు.

* బాగుపడాలనే కోరిక ఉండటం మంచిదే కాని అడ్డదిడ్డ మైనదార్లు త్రొక్కడం, నానాగడ్డికరవటం ఎంతో హేయ మైనది.

* అద్దాల మేడలో కాలంగడుపుతూ అహంభావంతో అందరి మీదా రాళ్ళువిసరవద్దు. మంది ఎదురుతిరిగితే మస్సైపోతావు.

* సంసారాలు నిలబెట్టుకోవడానికి కొందరు తాపత్రయ పడుతుంటే, చేజేతులా సంసారాలను కూల్చుకొనే ప్రయత్నంలో కొందరు సతమతమవుతున్నారు.

* గుళ్ళో అర్చనచేసినా, చర్చిలో ప్రార్థన చేసినా, మసీదులో నమాజు చేసినా మనశ్శాంతికోసం, మనోనిగ్రహంకోసం, పవిత్ర జీవనం కోసం మాత్రమే. కాని ప్రేమకు, త్యాగానికి, ఆరాధనకు, సేవాతత్పరతకూ మతాలు అడ్డుకారాదు.

* మానవజీవితం ప్రేమానుబంధాలతో ఆదినుంచీ ముందుకు సాగిపోతున్నమాట సత్యమే. ఇది అసత్యమైనా, ఆద్యంతం లేని కాలగమనంలా నిత్యనూతనంగానే అగుపిస్తున్నది.

* కన్నకూతురికోసం కట్నకానుకలు ఇచ్చుకోలేక, పెళ్ళి చెయ్యలేక బాధపడే తల్లిదండ్రులే కొడుక్కి కట్నంకావాలని వెర్రెత్తిపోవటం ఏమి విడ్డూరం?

* ఇష్టంలేని పెళ్ళిచేసుకొని జీవితాంతం నరకం అనుభవించే కంటే పెద్దవారిని ఒప్పించైనా, నొప్పించైనా ఇష్టమైన పెళ్ళిచేసుకొని సుఖసంతోషాలతో కాలంగడపటం మంచిది.

* ఒక మంచిపని చేయాలనే ఆలోచన వస్తే వాయిదా వేయకుండా వెంటనే దానికి పూనుకోవటం, లక్ష్యసాధనలో ఎన్ని అవరోధాలు ఎదురయినా పట్టుదలతో దాటి గమ్యాన్ని చేరటం ధీయుని లక్షణం.

* ద్వేషించటం, పీడించటం, గోతులు తీయటం మాని చేయూత నివ్వటం, అభిమానించటం అలవాటు చేసుకో.

* నీకు గిట్టనివారైనా, వారిలోవున్న సుగుణాన్ని మెచ్చుకో. కాని సుగుణాల్ని కూడా దుర్గుణాలుగా ఎంచి చాటుగా పదిమందిచెంతా ప్రచారం చేయటం మాత్రం శ్రేయస్కరం కాదు.

* క్రమశిక్షణ, సమయపాలన, ఉన్నత ఆదర్శం, సేవా భావం, దానగుణం, శీలసంపద పరోపకారం వంటి సద్గుణాలన్నీ బాల్యంనుంచే అబ్బేటట్లు తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు కృషిచేస్తే ఉత్తమ పౌరులవుతారు.

* ఆర్తులను, అనాథలను, పట్టించుకోకుండా ముందుకు సాగిపోవటంలో గొప్పతనం లేదు. వారికి అండగా నిలబడు అదేనీకు పూలబాట అవుతుంది.

* మాటఇచ్చి తప్పటంకంటే మరణించటం మేలు. దీనికంటే మాటఇవ్వక పోవటం ఉత్తమం.

* అందరికోసం పాటుపడేవారు, పదికాలాలపాటు పది మంది హృదయాల్లో నిలిచిపోతారు. స్వార్థచింతనతో కాలం గడిపేవారు గతించినా తలచేవారు ఉండరు,

* ఇతర ఆలోచనల్లో మునిగితేలుతూ పూజామందిరంలో కూర్చొని దేవుని ప్రార్థిస్తే ప్రయోజనంలేదు. ముందు నీ ఆలోచనా విధానంలో మార్పు రావాలి. ఆతర్వాత దేవుని ఒక్కనిముషం ఏకాగ్రతతో ధ్యానించినా చాలు.

* ముసలితనంలో నీవాళ్ళందరూ నిన్ను ఆదుకుంటారని ఆశపడవద్దు. ధనవంతుల పరిస్థితే అధ్వాన్నంగావుంటే పేదవారి విషయంలో ఇంకాచెప్పాలా? అందుకే ఆ భగవంతుని నమ్ము కుంటే వృద్ధాప్యంలో నిన్నుకంటికి రెప్పలా కాపాడుతాడు.

* ఎప్పుడూ ఎవ్వరినీ లక్ష్య పెట్టకుండా కాలం గడుపుతూ అవసరమొచ్చినపుడు అవతలివారిని మంత్రముగ్ధుల్ని చేసివేసి పనిగడుపుకొనే నేర్పు కొందరికుంటుంది.

* శ్మశాన వైరాగ్యం, ప్రసూతి వైరాగ్యం కాదు కావల సింది. క్షణికోద్రేకంలో చేసిన నిర్ణయాలు సరియైన ఆలోచ నలుకాదు. మాయను ఛేదించాలి. సత్య దర్శనంకోసం తపించాలి. ధ్యానంలో ఆనందం, రుచి గ్రహించాలి. సర్వేశ్వరుని కరుణకు పాత్రులు కావాలి.

* కామంవల్ల విచక్షణజ్ఞానం నశిస్తుంది నాగస్వరంవింటే నాగుపాముతన ఆగ్రహాన్ని వదిలి ఏవిధంగా నాట్యం చేస్తుందో ఆ విధంగానే కామంముందు ఈ కర్మేంద్రియాలు, ఈ జ్ఞానేంద్రియాలు తమతమ వివేకాన్ని విడిచి బానిసలై పోతాయి. ఇటువంటి విషమ పరిస్థితినుండి కాపాడేది ఒక్క భగవన్నామమే.

* సర్వతీర్థాలు సాగివచ్చినా, సకలయాత్రలు చేసివచ్చినా మనసునిలకడ లేనట్లయితే ఫలితం శూన్యమేకదా!

* నిన్ను నీవు నిగ్రహించుకోలేనప్పుడు ఇతరులను నీవు దారిలో పెట్టటానికి ప్రయత్నించకు.

* పాపం పండిపోయినా, పుణ్యం నిండిపోయినా మరణం తథ్యం.

* కష్టజీవి కడగండ్లు, ముష్టివాని వడగండ్లు వర్ణించలేం.

* ప్రతి రచనలోనూ ఒక దివ్యమైన సందేశాన్ని ప్రజావళి కందజేసి పరివర్తన కలిగించటమే ఆ రచనకు జీవం.

* తరుణం మించిన తపస్సు, పరువం మించిన పెళ్ళి నిరర్థకం.

* తొంగిచూసే కష్టాలు, పొంగివచ్చే దుఃఖాలు తీరే దెప్పుడో?

* చిలకరిస్తే వెన్నవచ్చేటట్లు పలకరిస్తే పన్నీరు చిలకాలి.

* పేదలు కార్చిన కన్నీరు పాదులకెన్నిటికో పోయవచ్చు.

* జాలిలేని హృదయం గాలిలేని గృహం వంటిది.

* ఏడుకొండలు ఎక్కటం ఎంతోకష్టం. శ్రీనివాసుడికది ఎంతోఇష్టం.

* కొందరికి అష్టకష్టాలే ఆభరణాలు, అవమానాలే ఆనందాలు.

* మనోనిగ్రహంసాధించలేని మనిషి సత్యాన్ని గ్రహించటం సాధ్యంకాదు.

* భక్తిలేని పూజ, భావంలేని మాట ఒక్కటే.

* పొలానికి ఎరువు ఇంటికి పరువు.

* గుణహీనులకన్నా గుడ్డివారు మిన్న.

* నిరుపేదల కన్నీరు స్వార్థపరులైన సంపన్నుల పన్నీరు.

* మనిషికి కళ్ళుఎంతో రాజ్యానికి రైతు అంతే.

* వేసవికాలంలో చల్లగాలి సోకితే ఆహ్లాదం కలిగేటట్లు సుభాషితాలు వింటూవుంటే ఎంతో ఆనందం కలుగుతుంది నిజమైన ఆనందం అవి అనుసరించటంవల్ల లభిస్తుంది.

* * * * * *

# ఆశీస్సులు

సుందర "సువర్ణభాషితాలు" సుప్రభాత సూర్యకిరణాలు లాగా సహృదయ హృదయ సరసీజములను సుప్రఫుల్లములు చేయుగాక!



సత్యం, శివం, సుందరం
కరుణశ్రీ
16-1-1964



"సువర్ణభాషితాలు" చదివాను. తాడి వెంకటకృష్ణారావు గారు వ్రాశారు. చక్కని శాశ్వత సత్యాలను ప్రజల కందించిన ఈ రచయిత ధన్యజీవి.

బందా కనకలింగేశ్వరరావు
28-2-1964

శ్రీ తాడి వెంకటకృష్ణారావుగారి "సువర్ణ భాషితాలు" సహృదయతకు, చక్కని కవితకు నిదర్శనాలు.

తన్మయ చిత్తంతో
పెండ్యాల
16-1-1964

చిరంజీవి తాడి వెంకటకృష్ణారావుచే రచింపబడిన "సువర్ణ భాషితాలు" చదివి తన్మయుడనైనాను. ఇందులోనున్న ప్రతి ఒక్క అంశం అమూల్యమే! ఇది చదివి ఈ విషయాలు ఆచరణలో పెడితే దేశం బాగుపడుతుందని వేరే చెప్పనక్కరలేదు. పిన్నవయస్కులైనా అనేక ఉదాహరణలతో కర్మ, భక్తి, జ్ఞాన, వైరాగ్యములను చాలా ప్రౌఢంగా చిత్రీకరించారు.

భగవంతుడు ఈ యువకుని సర్వదా కాపాడుగాక!

**అంతాల వెంకట సుబ్బారావు**

6-2-1964

**చిరంజీవి తాడి** వెంకటకృష్ణారావు రచించిన "సువర్ణ భాషితాలు" అను గ్రంథంలో భక్తులకు కాలమునకు తగిన భక్తి కలుగుటకు అనుకూలమైన అంశములున్నవి. చిన్న వయసయిననూ, విశాలమైన తెలివిచే ఇట్టి మధురమైన వాక్యములు వ్రాసినందులకు శ్రీకృష్ణ పరమాత్మ వారికి కర్మ, భక్తి, జ్ఞాన, వైరాగ్యములను అభివృద్ధి చేయవలెనని నా మనః పూర్వకముగా శ్రీకృష్ణ పరమాత్ముని ప్రార్థించుచున్నాను.

*స్వామి బ్రహ్మానంద సరస్వతి*

28-1-1964

